నేటి దినపత్రిక

# సూర్య ఆదివారం

www.suryaa.com

6 ఆగస్టు 2017

## అన్నా చెల్లెళ్ల అనుబంధానికి ప్రతీక రాఖీ

ఆగస్టు 7 రాఖీ పౌర్ణమి



















# చైర్మన్‌తో ముఖాముఖి





**నూకారపు సూర్యప్రకాశరావు**
చైర్మన్, సూర్య తెలుగు దిన పత్రిక

**సార్..తెలంగాణ జైళ్లలో గదులను అద్దెకు ఇస్తారట... కామెంట్ ప్లీజ్!**

ఇందులో ఆశ్చర్యపోవాల్సింది ఏమీ లేదు. మన దేశంలో ఇది కొత్తకావచ్చు.కాని ఇలాంటి సదుపాయాన్ని నార్వే దేశంలో ఉంది. ఇక్కడ ఒక్క విషయం మీరు గుర్తించాలి. గదులు అద్దెకు ఇచ్చేది, ఇతర రాష్ట్రాల్లోని జైళ్లకు మాత్రమే. మనకు కాదు. యూపీ, బీహార్ లాంటి రాష్ట్రాల్లో జైళ్లు ఖైదీలతో క్రిక్కిరిసి పోయాయి. వారి కోసం అదనంగా బిల్డిం గ్‌లు నిర్మించడం కంటే, ఇలా తెలంగాణ జైళ్లలో గదులు అద్దెకు తీసుకుంటే అక్కడి ప్రభుత్వాలకు ఆర్థికంగా వెసులు బాటు అవుతుంది. ఇక్కడ తెలంగాణ ప్రభుత్వానికి ఆదా యం వస్తుంది. ఈ కోణంలో ఆలోచిస్తే తెలంగాణ జైళ్లశాఖ మంచి నిర్ణయం తీసుకుందనే చెప్పాలి.

**సార్..తెలంగాణలో ప్రభుత్వ కాలేజీల్లో ె విద్యార్థుల సంఖ్య పెరుగుతుందంట.కామెంట్ ప్లీజ్!**

సంతోషమే కదా. దీనికి అసలు కారణం కార్పోరేట్ కళాశాలల అఫిలియేషన్లు నిలిపివేయడమే. ఇంటర్మీడియట్ బోర్డు సెక్రెటరీ చెప్పిన దాని ప్రకారం రాష్ట్రంలోని 29 కార్పొరేట్ జూనియర్ కాలేజీలకు 2017-18 విద్యాసంవత్సరానికి అఫిలియేషన్లు ఇవ్వలేదు. దీంతో రాష్ట్రంలోని 404 ప్రభుత్వ జూనియర్ కాలేజీల్లో విద్యార్థుల నమోదు ఇంటర్ మొదటి సంవత్సరంలో ఒక లక్ష వరకు పెరుగుతుందనేది అంచనా. దీనికి తోడు కేజీ టు పీజీలో భాగంగా ప్రభుత్వ విద్యను బలోపేతం చేసేందుకు ప్రభుత్వ జూనియర్ కాలేజీల్లో ఉచిత ప్రవేశాలు, ఉచిత పాఠ్యపుస్తకాల పంపిణీ కొనసాగిస్తామం టున్నారు. త్వరలోనే జూనియర్ కాలేజీల్లో కూడా మధ్యా హ్న భోజన పథకాన్ని అమలు చేసే అంశాన్ని ప్రభుత్వం పరిశీలిస్తున్నదని సీఎం కేసీఆర్‌వెల్లడించారు. అన్ని ప్రభుత్వ జూనియర్ కాలేజీల్లో ఆగస్టు నెలలోనే డిజిటల్ క్లాస్ రూమ్స్‌ను అందుబాటులోకి తీసుకువస్తున్నా మంటున్నారు. ఇది బడుగు బలహీన వర్గాల విద్యార్థులకు మేలు చేసే పరిణామం.

**సార్...ఏపీ రాజధాని అమరావతిలో మౌలిక వసతుల కల్పన 30 వేల కోట్లు కావాలంట...కామెంట్ ప్లీజ్.!**

కావాలి మరి. సంపన్నులు ఇంటి నిర్మాణానికే కోట్లు ఖర్చు చేస్తున్నారు. రాజధాని నిర్మాణం అంటే మాటలు కాదు కదా. అదో మాహయజ్ఞం లాంటిది. అఅమరావతిలో మౌలిక వస తుల కల్పన ఇతర అభివృద్ధి పనుల కోసం రాబోయే మూడే ళ్లలో 30 వేల కోట్ల రూపాయల నిధులు అవసరమవుతా యని సీఆర్‌డీఏ అంచనా వేసింది. ఆ మొత్తంలో 22,700 కోట్లను సమకూర్చుకునేందుకు ఇప్పటికే కుదుర్చుకున్న ఒప్పందాల అమలు వివిధ దశల్లో ఉన్నాయి. మరో 7,300 కోట్లు సమకూర్చు కొనేందుకు కొత్త మార్గాలను అన్వేషి స్తుంది. ఈ విషయాన్ని ముఖ్యమంత్రికి నివేదించింది.

**ఒడిశాలోని బరంపురం జిల్లాలో ప్రమాదాలకు పెట్రోల్ బంక్‌లదే బాధ్యత చేస్తారంట.ఇంది ఎంతవరకు న్యాయం సార్?**

అందులో అన్యాయం ఏముంది. హెల్మెట్ ధారణ అనేది వాహన చోదకుల బాధ్యత.కాని దాన్ని విస్మరిస్తున్నారు. ప్రజలు బాధ్యతలు విస్మరించిప్పుడు ఇలాంటిచర్యలు తప్పవు మరి. అదీ ప్రజల కోసమే కదా. హెల్మెట్ లేని వాహ నాలకు ఈ నెల 16వ తేదీ నుంచి పెట్రోల్ బంకుల్లో పెట్రోల్ సరఫరా చేయరాదని అక్కడి కలెక్టర్ ప్రేమ్‌చంద్ చౌదరి ఆదే శాలు జారీ చేసి ఓ మంచి నిర్ణయం తీసుకున్నారు. రోడ్డు ప్రమాదాల నియంత్రణ నేపథ్యంలో వాహనాలు నడిపే వారు హెల్మెట్ ధరించి వస్తేనే బంకుల్లో పెట్రోల్ పోసేలా చర్యలు తీసుకోవాలని పోలీసు శాఖను ఆదేశిం చారు. జాతీయ రహదారిలో గల పెట్రోల్ పంపుల్లో ఇంధ నం పోసి బయలు దేరిన వాహనాలు ప్రమాదాలకు గురైతే పెట్రోల్ బంకు యాజమాన్యాలదే బాధ్యతగా పరిగణిస్తా మని హెచ్చ రించారు. ఇదే విధానం దేశం మొత్తం ప్రవేశ పెడితే మంచి ఫలితాలు వస్తాయి.

**డ్రగ్స్ కేసు పరిశోధన హూందాగా సాగించాలని కోరుతూ తెలుగు ఫిల్మ్ ఇండస్ట్రీ ప్రతినిధులు సీఎం కేసీఆర్‌కు లేఖ రాశారంట.. కామెంట్ ప్లీజ్!**

ఈ లేఖ రాయడం వెనుక తెలుగు ఫిల్మ్ ఇండస్ట్రీ ప్రతి నిధు లు ఆంతర్యం ఏమిటో అర్థం కాలేదు. విచారణ సాగిస్తున్న అధికారులు సినీ నటుల విషయంలో అమర్యాదగా ప్రవర్తించిన దాఖలాలు లేవు. డ్రగ్స్‌తో సంబంధాలుంటే సిని పరిశ్రమ ప్రయోజనాలు దెబ్బతింటాయి, ప్రజలపై ప్రభా వం చూపుతుందికదా అని సెలెబ్రిటీలకు ప్రత్యేక మైన చట్టాలు ఉండవు కదా. మాదక ద్రవ్యాలు వినియో గించే వాళ్లు ఎప్ప టికీ హీరోలు కారు, కొద్ది మంది చేసిన పొర పాట్లకు పరి శ్రమ తలవంచుకోవలసిన పరిస్థితి రావడం బాధాకరమే అని సినీ ప్రముఖులు అంగీకరించారు కాబట్టి, అలాంటి వారిని పరిశ్రమనుంచి వెలివేస్తే, భవిష్యత్తులో ఇలాంటి సంఘటనలు జరగవకదా?

**దేశంలో వ్యవసాయం చేయడమన్నది ఉగ్రవాదం కన్నా ప్రమాదకరంగా మారిందంట.కామెంట్ ప్లీజ్!**

అన్నదాతలకు మినహాయిస్తే తిలాపాపం తలాపిడికెడు. వ్యవసాయం ఖర్చు తడిసి మోపడైపోయింది. అప్పుల ఊబి లో పడి అన్నదాతలు, పెరుగున్నం తిన్నంత ఈజీగా పురుగుల మందు కలిపుకుని తింటున్నాడు. కల్తీ మందులు, విత్తనాలు రైతులను సర్వనాశనం చేస్తున్నాయి. ఎంతో ఆశగా ఆరుగాలం కష్టించి పండించిన పంటలు చేతికి రాకరై తులు, వారిని నమ్ముకున్న కుటుంబ సభ్యులు ప్రాణాలు విడుస్తున్న వైనం బాధాకరం. ఇప్పుడే పరిస్థితులు ఇలా ఉంటే .. 2050 నాటికి దేశంలో భూతాపోన్నతి మరో మూడు డిగ్రీలు పెరుగుతుందని అంచనా. అప్పటికీ పం టల పరిస్థితి ఇంకా ఎంత దారుణంగా ఉంటుందో, వాటిపై ఆధారపడి జీవించే రైతుల పరిస్థితి మరెంత దారుణంగా ఉంటుందో ఊహించుకుంటేనే భయమేస్తుంది. దేశవ్యా ప్తంగా ఏకరీతి ప్రణాళికాబద్ధమైన వ్యవసాయ విధానం లోపించడం, పండిన పంటలకు గిట్టుబాటు ధర లభించక పోవడం వల్ల బ్రతుకుదెరువులేక రైతులు ఎక్కువగా ఆత్మహత్యలకు పాల్పడుతున్నారన్న నగ్నసత్యం ఇప్పటికైనా పాలకులు గుర్తిస్తే మంచిది.

SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072
మెయిల్ అడ్రస్

## సెటైర్

# రాజకీయ చాణక్యం

ఎక్కడ నెగ్గాలో కాదు, ఎక్కడ తగ్గాలో తెలిసిన వాడే నిజమైన నాయకుడు.. వారెవ్వా.. సినిమాలో పవన్ కళ్యాణ్ చెప్పిన మాటలు ఏపీ సీఎం చంద్రబాబు నాయుడు నిజం చేసి చూపించాడు.. హ్యాట్సాఫ్ చంద్రబాబు.. అంటూ పొగడడం మొదలు పెట్టాడు నా మిత్రుడు రాజు. చెప్పాను కదా మార్నింగ్ వాక్ వెళ్లి, తిరిగి వచ్చేప్పుడు టీ కొట్టు వద్ద ఆగడం.. అక్కడ చేరిన వారు మాట్లాడుకునే లోకాభిరామాయణం వినడం నాకు దినచర్యలో భాగమని. అలవాటు ప్రకారం ఈ రోజు నాకు ఇష్టమైన టీ కొట్టుదగ్గరకు వెళ్లి నిల్చున్నా.. నేను టీ చెప్పి అది వచ్చేలోగా, మా మిత్రుడు రాజు అక్కడికి వచ్చాడు. నేను జర్నలిస్టును కదా.. అందులో మావాడికి బాబంటే కాస్త అభిమానం ఎక్కువ. అలాగని వాడికి పార్టీలంటే పడదు సుమ్మీ. కాక పోతే చంద్రబాబు సీఎంగా ఉన్నప్పుడు హైదరాబాద్‌లో హైటెక్ సిటీ, నగరంలో ప్లైఓవర్ల నిర్మాణం జరిగింది కదా. అతను లేక పోతే అవి సాధ్యపడేవి కావని, ప్లై ఓవర్లే లేక పోతే ఈ రోజు హైదరాబాద్‌లో ట్రాఫిక్ సమస్య మరింత తీవ్రంగా ఉండేదని మావాడి అభిప్రాయం. నిజమే ఎవరి అభిప్రాయం వారిది. ఎదుటి వాళ్ల అభిప్రాయం గౌరవించాలి కదా. ఆ విషయంలో నువ్వే కరెక్ట్ అనేస్తా. అది వినగానే వాడి ముఖంలో ఓ చిరునవ్వు కనిపిస్తుంది. అయితే ఈరోజు చంద్రబాబును మావాడు పొగడ్తల్లో ముంచెత్తడం మాత్రం అందుకు కాదని అర్దం అయింది. ఎందుకో కూడా సూసాయగా తెలిసింది కాని, ఈలోగా వాడే తిరిగి మాట్లాడడం మొదలెట్టాడు. . ఉద్దానం కిడ్నీ బాధితుల పరామర్శించడానికి జనసేన అధినేత పవన్ వెళ్లడం, మరుసటి రోజు సీఎంను కలిసి సమస్యపై చర్చించడం తెలుసుకదా. పవన్ పార్టీకి అసెంబ్లీలో ఎమ్మెల్యేలు లేరు. ప్రతి పక్షపార్టీకాదు. కాని అతను వస్తున్నాడని తెలియగానే, చంద్రబాబు తన జిల్లా పర్యటనను క్యాన్సిల్ చేసుకుని మరి ఆయనతో భేటీకి అపాయింట్ మెంట్ ఇచ్చారు. సీఎం హోదాను మరిచి మరీ మరో రాజకీయ పార్టీ నేతకోసం ఎదురు చూశారంటే .. దానర్దం ఏంటి? ఎక్కడ నెగ్గాలో కాదు ఎగ్గడ తగ్గాలో తెలిసిన నేతం చంద్రబాబు అని అర్థమైంది కదా. అంతే కాదు,చంద్రబాబు,ప్రజా సంక్షేమానికి ఎంతటి ప్రాముఖ్యత ఇస్తున్నారో కూడా ఈ సంఘటన అద్దం పట్టింది. ఉద్దానం బాధితుల సమస్యను చర్చించేందుకు వచ్చాడు కాబట్టి, వారి సంక్షేమాన్ని దృష్టిలో ఉంచుకొని చంద్రబాబు, పవన్ కళ్యాణ్‌తో చర్చించేందుకు తన హోదాను పక్కన పెట్టారు. అంతే కాదు ప్రతిపక్షాలను కలుపుకొనైనా సరే, ఉద్దానం బాధితుల కిడ్నీ సమస్యకు పరిష్కారం చూపాలన్న చిత్తశుద్ధితో పనిచేస్తున్నారని అర్దం అవుతుంది,.అందుకే చంద్రబాబు చాలా గ్రేట్ అంటూ ముక్తాయింపిచ్చాడా రాజు. ఇంతలో టీ వచ్చింది.

నేను టీ తీసుకుని తాగుతున్నా. నా ముఖంలో ఎలాంటి స్పందనచ్ఛాయలు లేవు. దీంతో మావాడికి కాస్త చిరాకు అనిపించిందో ఏమో .. ఏంటి మాట్లాడవు. నేను చెపింది తప్పా?... అన్నాడు. నాకు ఏమి చెప్పాలో తోచ లేదు. కాని మావాడికి ఏదో సమాధానం చెప్పాలిగా. అబ్బే అదేం లేదు. నువ్వు చెప్పిన దాని గురించే ఆలోచిస్తున్నా. అంటూ టీ తాగడం పూర్తిచేశా. ఈలోగా మావాడు మళ్లీ అడిగాడు నేను చెప్పిందాట్లో నిజం లేదా? అని. ఇక ఆ విషయంపై మాట్లాడక పోతే మావాడు నన్ను వదిలేడా లేడని తెలిసిపోయింది. అబ్బే అదేం లేదు నీవు చెప్పిందాట్లో నిజం ఉంది కాని...అంటూ సాగదీసా. ..ఏంటి కాని, జర్నిలిస్టువుకదా.. ..మీకు అనుమానాలెక్కువ. ఆ కాని ఏంటో చెప్పు అన్నాడు. ఎస్.. నీవు చెప్పింది నిజమే అది పైకి కనిపించే నిజం. కాని లోగుట్టు వేరే ఉంది. అన్నా. ఏంటా లోగుట్టు అంటూ నిలదీశాడు మావాడు. ఏముంది.... ఉద్దానం బాధితుల కోసం ప్రభుత్వం చిత్తశుద్దితో పనిచేస్తూ ఉండవచ్చు. పవన్ కళ్యాణ్ వస్తున్నాడని తెలిసి, చంద్రబాబు టూర్ ఆపుకొని అతినితో చర్చించడం కూడా నిజం కావచ్చు. కాని పవర్ స్టార్ కు అంతటి ప్రియారిటీ ఇచ్చింది మాత్రం అందుకు కాదు. అది కాపు నేత ముద్రగడ ఎఫెక్ట్



అన్నా. అది మావాడికి నచ్చలేదు. అదెలాగా అని ప్రశ్నించాడు. అదే చెప్పుతున్నా. మాజీ మంత్రి ముద్రగడ పద్మనాభం తలపెట్టిన అమరావతి పాదయాత్రపై పోలీసులు ఆంక్షలతో ఆపివేసిన సంగతి తెలుసు కందా. పోలీసులు,ప్రభుత్వాలు ఎన్ని ఆంక్షలు పెట్టినా, పాదయాత్ర జరిపి తీరుతామని ముద్రగడ భీష్మించుకున్న సంగతి తెలుసు. అంతే కాదు పోలీసు గడువు ముగిసిన తర్వాత పాదయాత్రకు ముద్రగడ సన్నాహాలు చేసుకుంటన్నారు. మరో రెండేళ్లలో ఎన్నికలు వస్తుండగా, ముద్రగడ పాదయాత్ర కాపుల్లో టీడీపీ పట్ల వ్యతిరేకత పెంచకుండా చూసుకోవాలి. మరోవైపు కర్నూలు జిల్లా నంద్యాల బై పోల్ ప్రతిష్టాత్మకంగా మారింది. అక్కడ దాదాపు 40 వేల వరకు బలిజ ఓటర్లు ఉన్నారు. చంద్రబాబు, కాపులకు రిజర్వేషన్ కల్పిస్తామని చెప్పి దాటవేస్తున్నారు. కాపులను చిన్నచూపు చూస్తున్నారు అని గళం విప్పితే ఆ ఏఫెక్ట్ నంద్యాల మీద పడుతుంది. అలా పడకుండా ఉండాలంటే, చంద్రబాబుకు కనిపించిన పరిష్కార ఆయుధం పవన్ కళ్యాణ్. అతను కూడా ఆ సామాజిక వర్గానికి చెందినవారే. కాబట్టి కాపునేత కోసం తాను టూర్ కూడా క్యాన్సిల్ చేసుకున్నా. కాపులంటే తనకు చాలా గౌరవం అని చెప్పుకోవడానికి తురుపు ముక్కగా పనికి వస్తుందని చంద్రబాబు పవన్‌ను వాడుకున్నారన్నది రాజకీయ విశ్లేషకుల అభిప్రాయం. అంతే కాదు ఉద్దానం సమస్య ఇప్పటిది కాదు. ప్రభుత్వం చర్యలు తీసుకున్నా, అంత తేలిగ్గా పరిష్కారం అయ్యే సమస్య కాదు. మరి బాధితులను పరామర్శించి, పవన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా మాట్లాడితే, తాము పడిన శ్రమ అంతా వృధా అవుతుంది. కాబట్టి, పవన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా మాట్లాడకుండా అతినితో చర్చించి ఫలితాన్ని ప్రభుత్వానికి అనుకూలంగా మార్చుకున్నారు చంద్రబాబు. అది రాజకీయ చాణక్యమంటే. కాని ప్రస్తుతం ముద్రగడ పాదయాత్ర ఎఫెక్ట్ నుంచి తప్పించేందుకు, ఉద్దానం సమస్య తీవ్రతను తగ్గించేందుకు, చంద్రబాబు తెలివిగా, టూర్ క్యాన్సిల్ చేసుకొని జనసేనానితో బేటీ అయ్యారు. అంటే వన్ షాట్ టూ బర్డ్స్ అన్నమాట. దీన్నిబట్టి నాకు అర్దం అయిందేటంటే. ప్రతిపక్షాలను ఎక్కడ రెచ్చగొట్టాలో కాదు, ఎక్కడ జోకొట్టి .. ఎలా బజ్జోపెట్టాలో తెలిసి వాడే నిజమైన రాజకీయ పార్టీ అధినేత అని. నామాటలు పూర్తి కాక ముందే మావాడు అక్కడి నుంచి జారుకున్నాడు. బాబును విమర్శించడం నచ్చక. అది చూసినేను మెల్లగా ఇంటిదారి పట్టా!



శిశువు హాయిగా నిద్రించే ఉయ్యాల, మృతుడు శాశ్వతంగా నిద్రించే సమాధి, ఈ రెంటిపైనా మెరిసే తార మానవుడి ఆశ. -అరవింద యోగి

నవకవిత్వం

# నేనెందుకు భయపడాలి?

చావుకు నేనెందుకు భయపడాలి?
అమ్మ కడుపులో ఉన్నదగ్గర నుంచే
అది నన్ను నీడలా వెంటాడుతోంది
గోరిగాడి నక్కలా ఎదురు చూస్తోంది
ఛాన్స్ దొరికితే కాటేద్దామని.
కబళించి వేద్దామని..
కసి తీర్చుకుందామని
కాని నన్ను కౌగిలించుకోవాలంటే
అదే భయపడుతోంది..
అల్లంత దూరం పరుగెడుతోంది
శివుని ఆజ్ఞ కోసం ఎదురు చూస్తోంది..
అందుకే నేనెందుకు చావుకు భయపడాలి?
ఆ శివయ్యే నాకు తోడైనప్పుడు
ఆ శివయ్య సన్నిధి కోసం నేనుఎదురు చూస్తున్నప్పుడు
చావుకు నేనెందుకు భయపడాలి?
శివయ్యకు నామీద దయ కల్గినప్పుడు
నా తోడు అవసరం అయినప్పుడు
ఆయనే చావుకు సైగ చేస్తాడు
మా శివయ్య ఆజ్ఞాపిస్తేనే.. ..
చావు నన్ను చేరుకుంటుంది
మరి నా శివయ్య ఆజ్ఞ శిరసా వహించే
చావుకు నేనెందుకు భయపడాలి?
నా కోసం అదే వేచి చూస్తుండాలి తప్ప!

..... చారుశ్రీ,
7337088972

## రన్నింగ్ వాయిస్




**అమానవీయం**

సండే కవర్ స్టోరీ చాలా బాగుంది. రాకెట్ యుగంలో కూడా మనుషుల అక్రమ రావాణా సాగడం నిజంగా శోచనీయం. ప్రపంచ దేశాలు సిగ్గుతో తలదించుకోవాల్సిన విషయం. ముఖ్యంగా ప్రపంచంలోని వందగు పైగా దేశాల్లో ఈ ట్రాఫికింగ్ యధేచ్ఛగా సాగడం అనేది పాలకుల నిర్లక్ష్యానికి అద్దం పడుతుంది.

....రాజమన్నార్, రాజమండ్రి

**లోగుట్టు..**

సెటైర్ బాగుంది. నితీష్ కుమార్ గారు, అభివృద్ధి మంత్రం జపించడం నిజంగా దిగజారిన రాజకీయ విలువలకు నిలువెత్తు నిదర్శనం. ప్రధాని పదవికి పోటీ వడిన నేత, ఆకోర్కె తీరదని తేలేవరకు, సీఎం పదవి కాపాడుకోవడం కోసం మరో పార్టీతో జతకట్టడం రాజకీయనాయకులు దుర్నీతికి అద్దం పడుతోంది.

...శ్రీకాంత్, కర్నూలు

**శిక్షించడానికి..**

కూనిరాగాలు అనిముత్యాల్లా ఉంటున్నాయి. నిజమే శిక్షించడానికి కారణాలు చెప్పితీరాలి. రక్షించడానికి వివరణ అవసరం లేదు. రెడ్డిగారు ఇలాంటి జీవిత సత్యాలు చాలా ఆందిస్తున్నారు. దన్యవాదాలు..

...రామలింగం, రంగారెడ్డి జిల్లా.

**శ్రావణ మాసం..**

శ్రావణమాసం విశిష్టత, ఈ మాసంలో వచ్చే నోములు, వ్రతాల గురించి వివరించినందుకు థ్యాంక్స్. సూర్య సండే సందర్భోచితంగా కథలు అందిస్తున్నందుకు ధన్యవాదాలు.

..ఉమాగౌరి, హైదరాబాద్..

**అలనాటి అందాలతార**

సనీ పరిశ్రమ, చివరకు సినీ ప్రేక్షకులు మరిచిపోయిన అలనాటి మేటి నటి, అందాల తార కన్నాంబ గారి గురించి గుర్తిచేసినందుకు సూర్య సండేకు కృతజ్ఞతలు.

... భవాని, విజయవాడ

**అమ్మ అమ్మే..**

అమ్మ ప్రేమ గురించి చాలా చక్కగా వివరించారు రచయిత,. అమ్మప్రేమ అమృతం. దానికి సాటి మరోటి ఉండదు. కథ చెప్పిన తీరు బాగుంది..

...రామరాజు, ఉప్పల్, హైదరాబాద్

## 'కూని'రాగాలు

భయం జీవిత గమనాన్ని మారుస్తుంది..!
గేయం బతుకు అర్థాన్ని వివరిస్తుంది..!!

కలవరపాటు మాటలు కచ్చితం కావు..!
తొందరపాటు పనులు యోగ్యం కాదు..!!

అనుమానంతో మనసును గెలవలేము..!
అభిమానంతో అనురాగం పెంచగలము..!!

కలిసిరాకుంటే ఏదైనా కఠినమే..!
వలచివద్దంటే ఎవరైనా భగ్నమే..!!

గద్దె నెక్కితే గొప్పవారుకారు..!
పద్ధతి నేర్చితే చిరకాలముంటారు..!!

- కూనిరెడ్డి శ్రీనివాస్

## ఫన్ చ్










నారు



# పెళ్లి తంతు!

**పెళ్లి..ఇది తెలియని వారెవరూ ఉండరు..కానీ పెళ్లి జరిగే తంతు పట్ల కానీ..వివాహ వ్యవస్థ ఉద్దేశ్యాల పట్ల కానీ అందరికి సరైన అవగాహన లేదు. పెళ్ళంటే తప్పట్లు, తాళాలు, తలంబ్రాలే కాదు ఇంకా చాలా ఉన్నాయి. మరి అవేంటో తెలుసుకోవాలని ఉందా ? అయితే ఇది చదవండి. వివాహం అనేది కేవలం ఇద్దరు వ్యక్తుల మధ్యే కాదు రెండు కుటుంబాల మధ్య అని చెప్పే ఒక తంతు. అయిదు రోజుల పెళ్లయినా, మూడు రోజుల వివాహమైనా, ఒకే రోజు.. ఒకే పూట, ఒకే గంట పరిణయమైనా..ఎలా జరిగినా పెళ్లి అసలు లక్ష్యం వధూవరుల సుఖ సంతోషాలే.**

అందరి బంధువుల సమక్షంలో పెద్దల ఆశీర్వచనాలు, దీవెనలతో ఇద్దరూ ఒక్కరుగా మారిపోయారనే గుర్తింపు కోసమే. స్త్రీ, పురుషుల మధ్య శారీరక, మానసిక, ఆర్థిక, సాంఘిక, సామాజిక సంబంధాలని ఏర్పరచే సామాజిక సాంప్రదాయ ఒప్పందం పేరే పెళ్లి అనొచ్చు.

ఋగ్వేదంలోనూ, అధర్వణ వేదంలోనూ వివాహ సంస్కార విధులు చెప్పబడ్డాయి. కాలం మారుతున్నకొద్దీ పెళ్లి తంతులో కూడా అనేక మార్పులు చోటుచేసుకున్నాయి. ప్రతి మనిషి చేయాల్సిన 18 సంస్కారాలని గృహస్తు సూత్రాలు చెబుతున్నాయి. హిందూ ధర్మం ప్రకారం వివాహానికి రెండు ప్రాధాన్యతలు ఉన్నాయి. అందులో ఒకటి ధార్మిక ప్రాధాన్యత, రెండోది సామాజిక ప్రాధాన్యత. మంత్ర బద్ధంగా జరిపే వివాహానికి ఈ రెండు లక్షణాలే లక్ష్యమయి ఉంటుంది. దైవానుగ్రహం కోసం లయబద్ధంగా జపించే శబ్దాలే మంత్రాలు. ప్రతి శబ్దానికి ఓ స్పష్టమైన, నిర్ధిష్టమైన, నిఘూడమైన శక్తి ఉంటుంది. మన వేదాల్లోనే కాక ఇతర మతాల గ్రంథాల్లోనూ శబ్దానికి ఉన్న శక్తిని, మహత్తుని తెలిపే ఆధారాలు ఉన్నాయి. అలా మంత్రయుక్తంగా జరిపే వివాహ తంతులో చేసే ప్రక్రియలన్నీ కేవలం వధూవరులకే కేటాయించినవి కావు. కొన్ని కుటుంబం కోసం, కొన్ని సుఖ సంతోషాల కోసం, కొన్ని వినోదం కోసం, కొన్ని దైవానుగ్రహం కోసం..ఇలా అన్నీ కలిస్తే ఈ తంతు అంతా కలిసితేనే ఒక పెళ్లి సందడి. తప్పట్లు, తాళాలు, తలంబ్రాలు, సంబరాలు బందుమిత్రుల విందు వినోదాలు.. ఆ పెళ్లి తంతు గురించి సింపుల్‌గా స్పష్టంగా తెలుసుకుందాం..

వరుడు తలపై గొడుగు, చేత్తో కర్ర పట్టుకుని తాను సన్యసించి కాశీకి వెళ్తుం టాడు. అప్పుడు వధువు సోదరుడు వచ్చివ రుని చేయి పట్టు కుని నమ స్కారం చేసి ఓ బ్రహ్మ చారి, మీరు కాశీ వెళ్లొద్దు.

**పరిణయ విధానం..**

ప్రస్తుతం అమలులో ఉన్న వివాహ పద్ధతిని బ్రహ్మ రీతి వివాహ పద్ధతి అం టారు. దీన్నే అపస్తంబ పద్ధతి అని కూడా వ్యవహరిస్తారు. అయితే ఒక్కో ప్రాంతాన్ని బట్టి, అక్కడి ఆచార వ్యవహారాలు, సాంప్రదా యాల వల్ల ఈ పెళ్లి పద్ధతుల్లో అనేక తేడాలు కనిపిస్తాయి. అయితే ఈ పెళ్లిలోని ప్రతి చర్య వెనకా స్పష్టమైన నిర్ధిష్టమైన ఉద్ధేశ్యాలు ఉన్నాయి.



**పెళ్లి చూపులు.....** కాబోయే వధూవరులు ఒకరి నొకరు చూసుకోవటానికి పెళ్లి చూపులు ఏర్పాటు చేస్తారు. ఒకరినొకరు చూసుకోవడం, అభి ప్రాయాలు పంచుకోవడంతో పాటూ జీవిత భాగస్వామిని అంగీకరించేందుకు పెళ్లిచూపులు ఒక వేదికలా పనిచేస్తుంది.

**నిశ్చయ తాంబూలాలు...**

అమ్మాయి అబ్బాయి ఒకరికొకరు నచ్చాక, ఇరుపక్షాల పెద్దలు మిగతా విషయాలు అన్నీ మాట్లాడుకుంటారు. కట్నకానుకల గురించి మాట్లాడుకున్నాక ఓ మంచిరోజు చూసి పురోహితుడి సమక్షంలో అందరికీ అనువుగా ఉండే వివాహ ముహూర్తాన్ని నిర్ణయిస్తారు. ముహూర్తం ప్రకారం లగ్న పత్రికని రాయించు కుని పెళ్లి నిశ్చయం అయింది అన్నట్టుగా లగ్న పత్రి కలతో పాటూ తాంబూ లాలు పరస్పరం ఇచ్చి పుచ్చుకుం టారు. దీన్నే నిశ్చితార్థం అని, కొన్ని చోట్ల పూలు పళ్ళు అని అంటారు. ఒకరకంగా లగ్న పత్రిక అంటే, ఆ పెళ్లిని ఇరు వైపు పెద్దలు ఆమోదిస్తూ కుదు ర్చుకున్న ఒప్పందం లాంటిది.

**స్నాతకం....**

పెళ్ళి కొడుకు ఇంట్లోగాని లేదా పెళ్ళికి ముందు కళ్యాణ మండపంలో లేదా విడిదిలో గాని స్నాతకం చేస్తారు. ఇది ఒకరకంగా శారీరక మానసిక శుద్ధి ప్రక్రియ అనొచ్చు. విఘ్ననాయకుడు గణేశుడి పూజతో ఈ కార్యక్రమం మొదలౌతుంది. పురోహితుడు వరుడిచేత గోత్ర ప్రవరలు చెప్పిస్తాడు.

**కాశీయాత్ర....** వరుడు తలపై గొడుగు, చేత్తో కర్ర పట్టుకుని తాను సన్యసించి కాశీకి వెళ్తుం టాడు. అప్పుడు వధువు సోద రుడు వచ్చివ రుని చేయి పట్టు కుని నమ స్కారం చేసి ఓ బ్రహ్మ చారి, మీరు కాశీ వెళ్లొద్దు. నా సోదరి నిచ్చి మీకు వివా హం జరిపి స్తాము. గృహస్తు నిగా మారండి అని నుదుట బొట్టు పెట్టి తాం బూలం, నూతన వస్త్రాలు ఇచ్చి ఆహ్వాని స్తాడు. సన్యాసం తీసు కుందామని అ నుకున్న బ్రహ్మ చారిని గృహస్తుగా మార్చే ప్రక్రియ అన్న మాట.

**వరపూజ లేదా ఎదుర్కోళ్లు....**

కాశీ యాత్ర మానేసి వివా హానికి సిద్ధపడిన వరుడిని, మేళ తాళాలతో కన్యా దాత ఎదురెళ్లి పానకం బిందెలు, కొత్త బట్టలతో స్వాగతిస్తాడు. ఓ బిందెలో మంచి నీళ్లు మరో బిందెలో పానకం ఉంటాయి. వరుడి చేత ఆ పానకం రుచి చూపిస్తాడు. వరుని తల్లిదండ్రులు, బంధువులని పెళ్లికి ఆహ్వానిస్తారు. తీపి తిన్పించడం ద్వారా ఒక శుభ కార్యక్రమాన్ని మొదలెడుతున్నాం అనే భావనని కలిగిస్తారు.

ఇక కల్యాణం..కమనీయం అంటూ ఆనంద పారవశ్యాల్లో మునిగి తేలడానికి రంగం సిద్ధం అవుతుంది. సమాజం, సంఘం, కుటుంబం సాక్షిగా ఇద్దరు యువతీ యువకులు కలిసి ఒక సరికొత్త పెళ్లి పుస్తాకాన్ని మొదలెట్టడానికి అందరి అనుమతీ లభిస్తుంది.

**మంగళస్నానాలు...**

పెళ్ళికి ముందు వధువు పరిశుభ్రంగా స్నానం చేసి గౌరీపూజకు సిద్ధపడుతుంది. కన్యాదాత కూడా అభ్యంగన స్నానం చేస్తాడు. పవిత్ర భావనతో పూజకు రెడీ అవుతారు.

**గౌరీపూజ.....**వధువుచేత కన్యాదాత ఇంట్లో గౌరీపూజ చేయిస్తారు. పదికాలాలు పసువు కుంకుమలతో వర్ధిల్లేలా ఆశిర్వదించమని గౌరీదేవిని వధువు పలురకాలుగా పూజిస్తుంది.

**కన్యాపరణం.....**పెళ్ళికొడుకు తన వివాహర్థం కొందరు బంధుమిత్రులని వధువు దగ్గరికి పంపుతాడు. తనని పెళ్ళి చేసుకోవలసిం దిగా వాళ్ల ద్వారా వధువుకి కబురు పెట్టి ఆహ్వానం పలుకుతాడు.

ఇక కల్యాణం..కమనీయం అంటూ ఆనంద పారవశ్యాల్లో మునిగి తేలడానికి రంగం సిద్ధం అవుతుంది. సమాజం, సంఘం, కుటుంబం సాక్షిగా ఇద్దరు యువతీ యువకులు కలిసి ఒక సరికొత్త పెళ్లి పుస్తాకాన్ని మొదలెట్టడానికి అందరి అనుమతీ లభిస్తుంది. ఒక కుటుంబాన్ని ఏర్పరచుకొని కొత్త జీవితాన్ని ప్రారంభిస్తారు.సో పెళ్లంటే పందిళ్లు, సందళ్లు, తప్పెట్లు, తాళాలు, తలంబ్రాలే కాదు. ఇంత తంతు ఉంటుందన్న మాట.





బాపు దర్శకత్వం వహించిన వంశవృక్షం చిత్రంతో ఆయన ఎడిటర్‌గా చలన చిత్రసీమకు సుపరిచితులయ్యారు...నాటి నుంచి దర్శకుడు బాపు ప్రతి చిత్రంలోనూ ఎడిటర్ – అనిల్ మల్నాడ్ పేరు తప్పనిసరైంది... వంశీ తీసిన సితార చిత్రానికి 1985లో ఉత్తమ ఎడిటర్ జాతీయ పురస్కారం అందుకున్నారు. పలు భాషా చిత్రాలకు ఎడిటర్‌గా నేటికీ చురుగ్గా పనిచేస్తున్నారు... మీడియాకు, పబ్లిసిటీకి దూరంగా ఎంతో సింపుల్‌గా ఉండే ఎడిటర్ అనిల్ మల్నాడ్ గురించి తెలుసుకుందాం...



# బాపు పెంచిన వృక్షం

## ఎడిటర్ అనిల్ మల్నాడ్



అసలు పేరు జి.ఆర్. దత్తాత్రేయ. తమిళులు దత్తాత్రేయ పదం పలకలేకపోయారు. అందువల్ల సులువుగా ఉండేలా అనిల్ దత్ అని పిలిచేవారు. అనిల్ పుట్టిన ప్రాంతం పేరు మల్నాడు. ఆ ప్రాంతం పేరును కలుపుకుని అనిల్ మల్నాడ్‌గా స్థిరపడ్డారు. తన సొంత కృషిని నమ్ముకుని ఇండస్ట్రీలో ఎటువంటి గాడ్ ఫాదర్ లేకుండా ఎదిగారు అనిల్ మల్నాడ్.

**సంపూర్ణ రామాయణం:** అనిల్ తన 17వ ఏట 1970లో క్రియేటివ్ దర్శకుడు బాపు దగ్గర శోభన్‌బాబు, చంద్రకళ నటించిన సంపూర్ణరామాయణం చిత్రానికి అసిస్టెంట్ దర్శకుడిగా చేరారు. అసలు ఆయన లక్ష్యం సినిమాలకు కెమెరామెన్ అవుదామనే. అందుకని చెన్నై వచ్చేశాడు. అయితే కెమెరామెన్‌గా అనుకుంటే ఆఖరుకు ఎడిటింగ్ విభాగంలో సెట్ అయ్యాడు. ఎడిటింగ్‌లో అవకాశం వచ్చింది కదా అని ఏ మాత్రం ఆలోచించకుండా అసిస్టెంట్‌గా చేరిపోయాడు అనిల్.

**అగ్రదర్శకులతో:** ఎందరో అగ్రదర్శకుల వద్ద ఎటువంటి అరమరికలు లేకుండా తన కెరీర్ సాగించాడు అనిల్ మల్నాడ్. బాపు, వంశీ, గీతాకృష్ణ, రాఘవేంద్రరావు వంటి చాలామంది దర్శకులతో పనిచేశారు. అలాగే తమిళంలో ఆర్‌వీ. ఉదయ్‌కుమార్, ఆర్.కె.సెల్వమణి... వీరిద్దరి వద్దా ఎక్కువగా ఎడిటింగ్ విభాగంలో చేశారు. వీళ్లే గాక ఇంకా మణివణ్ణన్, మనోబాల... వంటి కోలీవుడ్ మేటి దర్శకులు అనిల్ వర్క్‌ని బాగా ఇష్టపడేవారు.

చదువుకునే రోజుల్లోనే కన్నడ, తుళు, కొంకిణి, తమిళం, తెలుగు, హిందీ భాషలు నేర్చుకున్నారు అనిల్. నేర్చుకున్న విద్య ఏదీ వృథా పోదు అని పెద్దలు చెప్పినట్లుగా, ఆనాడు అనిల్ నేర్చుకున్న భాషలు వివిధ భాషల్లో ఎడిటింగ్‌కు ఎంతగానో తోడ్పడ్డాయి అనిల్‌కి. పని చేయాలనే పట్టుదల ఉంటే ఏదైనా సాధించగలమంటారు అనిల్. వృత్తిని దైవంగా భావించి అంకితభావంతో పనిచేయడం అనిల్ నైజం. సినిమారంగంలో ఆ క్రమశిక్షణ, సిన్సియారిటీల వల్లే ఇన్ని సంవత్సరాలుగా ఈ రంగంలో ఉండగలిగారు.

అక్కినేని సంజీవ్ (ఎల్.వి.ప్రసాద్ తమ్ముడు), మందపాటి రామచంద్రయ్యలు ఎడిటింగ్‌లో అనిల్‌కు గురువర్యులని చాలా సందర్భాలలో చెప్పారు. సినిమాలో మొత్తం 24 ఫ్రేమ్స్ ఉంటాయి. అందులో ఎడిటింగ్ కూడా ఒకటి. ఎడిటింగ్ చేయడంలో తేడా వస్తే మాత్రం కథను అర్థం చేసుకోవడం కష్టం. సాధారణంగా ఎడిటింగ్ చేసేటప్పుడు మాతో పాటు డైరెక్టర్, కో డైరెక్టర్ ఉంటారు. వాళ్లు దగ్గర ఉంటేనే పని సులువవుతుందంటారు అనిల్. తెర వెనుక పని చేసేవాళ్లు ఎలా ఉంటారో సామాన్య ప్రజలకు తెలియదు. కానీ నటీనటులను వెండి తెర మీద చూస్తారు కనుక వారిని వెంటనే గుర్తించగలుగుతారు. వాళ్లకు వచ్చే ప్రశంసలన్నీ మాకు వచ్చినట్లే కదా అంటారు అనిల్.

**సమయపాలన:** బాపుగారి పది సినిమాలకు పని చేసిన తర్వాత, వంశీ, ఏడిద నాగేశ్వరరావుగారి ద్వారా అనిల్‌ని పిలిపించారట. ఆ తరవాత గీతాకృష్ణ కూడా అనిల్‌తో చేయించుకున్నారు. సీనియర్ దర్శకుడు బాపు వద్ద షూటింగ్ సమయంలో ఎప్పుడూ సమయపాలన పాటించేవారు అనిల్. అందుకే ఆ కాంబినేషన్ అలా వర్కవుట్ అయింది. అంతేకాదు అనిల్‌మల్నాడ్ ప్రయాణం తెలుగు సినిమాలతో మొదలైంది, తెలుగు సినిమా తనకు తల్లి లాంటిదంటారు. అనిల్‌కు అవార్డులు తెచ్చిందీ తెలుగు సినిమానే. బాపుగారికి అనిల్ పెద్ద కొడుకుతో సమానం అంటారెప్పుడూ... బాపుతో మొత్తం 22 సినిమాలకు పని చేశారు అనిల్. ఇండస్ట్రీలో ఇంత ఎదగడానికి కారణం బాపురమణలే. తనకు వాళ్లు సినిమా మనుషుల్లాగ అనిపించరంటారు. అంత సింపుల్‌గా ఉంటారు వాళ్లు. మొదటినుంచి అనిల్ బయట పబ్లిసిటీకి రాకపోవడానికి కారణం కూడా అదే అయివుండవచ్చు. వారి నుంచే ఆ లక్షణం అనిల్‌కు వచ్చిందని ఇండస్ట్రీ గుసగుసలాడుతుంటారు.








**జాతీయ స్థాయి అవార్డు:** బాపుగారి దగ్గర అనిల్ అసిస్టెంట్‌గా మొదలుపెట్టిన నాటి నుంచి ఆయన తనను దగ్గరగా చూశారు. పని పట్ల అనిల్‌కున్న నిబద్ధతను గమనించిన ఆయన, వంశవృక్షం చిత్రానికి ఎడిటింగ్ బాధ్యతలు చేపట్టమని స్వయంగా ఆదేశించారట. ఆయన మాట కాదనలేక అంగీకరించారు అనిల్. అనిల్ మల్నాడ్‌తో ఎడిటింగ్ అంటే 10 నిమిషాలుముందే ఉండాలి అని స్వయంగా ఆయనతోనే అనిపించుకున్నారు. ఆయన నుంచి నేర్చుకున్న క్రమశిక్షణ వల్లే తాను ఈ స్థాయికి వచ్చానంటారు అనిల్.

బ్లాక్ అండ్ వైట్‌కి, రంగుల సినిమాకి ఎడిటింగ్‌లో ఏమైనా తేడా ఉంటుందా? అని అనిల్‌ని అడిగితే...ప్రస్తుతం కంప్యూటర్ విధానం రావడం వల్ల పని తేలికైపోయింది. ఆరుగురు చేసే పనిని ఒక్కరు చేసేస్తున్నాం. ఎడిటింగ్ విషయంలో రంగులు, నలుపు తెలుపు తేడా లేదంటారు. మొట్టమొదటి జాతీయ అవార్డు వంశీ తీసిన సితార చిత్రానికి 1984లో నాటి రాష్ట్రపతి జైల్‌సింగ్ చేతుల మీదుగా అందుకున్నారు. అప్పుడు అనిల్ వయసు 25 సంవత్సరాలు. అసలు అవార్డు గురించి తెలుసుకునేంత జ్ఞానం కూడా అప్పుడు తనకు లేదంటారు. దక్షిణాది వారికి జాతీయ అవార్డు రావడం చాలా విశేషం.











బెజవాడ బెంజ్ సర్కిల్ తెలియని తెలుగు వారు ఉండరు అంటే అతిశయోక్తి కాదేమో... విజయవా డకే ఒక గుర్తింపు ఈ బెంజ్ సర్కిల్.. ఒక పక్క చెన్నై, ఒక పక్క మచిలీపట్నం, ఒక పక్క హైదరాబాద్, ఒక పక్క విశాఖ వెళ్ళే రోడ్డులను కలిపే ఈ బిజీ బెంజ్ సర్కిల్ కు ఆ పేరు ఎలా వచ్చింది ? దాని చరిత్ర ఏమిటో ఇప్పుడు తెలుసు కుందాం. అటు చెన్నై, ఇటు కోలకత్తాను కలిపే జాతీయ రహదారాలను కలిపే, బెంజ్ సర్కిల్ అంటే గుర్తుకువచ్చేది ట్రాఫిక్.. ఎటు నుంచి, ఎటైనా ఇక్కడ ట్రాఫిక్ సిగ్నల్ దాటితే, ప్రపంచాన్ని జయించినంత ఆనందం వేస్తుంది అంటే అతిశయోక్తి కాదేమో... ఇప్పటి జనరేషన్ కు, బెంజ్ సర్కిల్ అంటే, ట్రెండ్ సెట్ మాల్ అనే ల్యాండ్ మార్క్ స్ట్రైక్ అవుతుంది. అంతటి పెద్ద మల్టీప్లెక్ష్ వచ్చింది మరి. కాని, మన తాతలకి, తండ్రులకి, బెంజ్ సర్కిల్ అంటే గుర్తుకు వచ్చేది అక్కడ ఒక మూలన ఉండే, బెంజీ కంపనీ. బెంజ్ సర్కిల్ అనే పేరు కూడా, ఆ బెంజ్ కంపెనీ వల్లే వచ్చింది. ఇప్పుడు ఉన్న బెంజ్ సర్కిల్ పక్కన, .శేష గిరి రావు సన్స్ అనే ఆటోమొబైల్ కంపెనీ ఉండేది. తరువాత అది జాస్పర్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ గా పేరు మార్చుకుంది. బాడిగ శేషగిరి రావుఈ కంపెనీ ఫౌండర్. ఈయన, మచిలీపట్నం ఎంపీగా పని చేసిన బాడిగ రామకృష్ణ తం డ్రి. . శేషగిరి రావు సన్స్ , 1955 ప్రాంతంలో, టెల్కో అనే ఆటోమొబైల్ కంపనీకి డీలర్ గా ఉండేది. ఈ టెల్కో కంపెనీనే, ఇప్పటి టాటా మోటార్స్. ఈ షోరోంలో బెంజ్ ట్రక్స్ అమ్మేవారు, ఈ షోరోం కారణంగానే అప్పటి నుంచి ప్రజలు, ఈ ప్రదేశాన్ని, బెంజ్ సర్కిల్ అని పిలవటం మొదలుపెట్టారు. ప్రస్తుతం ఈ కంపెనీ, జాస్పర్ ఆటో సర్వీసెస్ ప్రైవేటు లిమిటెడ్ పేరుతో బెంజ్ సర్కిల్లో కార్యకలపాలు చేస్తుంది. బెంజ్ సర్కిల్లో ఒక విగ్రహం ఉం టుంది, ఎప్పుడైనా గమనించారా ? ఆ విగ్రహం కాకాని వెంకటరత్నం విగ్రహం. వీరు జై ఆంధ్ర ఉద్యమంలో కీల కంగా వ్యవహరించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో కాసు బ్రహ్మానందరెడ్డి, నీలం సంజీవరెడ్డిల వద్ద వ్యవ సాయ, పశుపోషక మరియు పాలసేకరణ శాఖకు మంత్రిగా పనిచేశారు. 1972లో జరిగిన జై ఆంధ్ర ఉద్య మంలో వీరు కీలకంగా వ్యవహరించి మంత్రిపదవికి రాజీనామా చేశారు. వీరు 1972, డిసెంబరు 25న గుండెపోటుతో మరణించారు. ఇప్పుడు బెంజ్ సర్కిల్, నవ్యాంధ్ర రాజ ధాని అమరావతిలో ఒక ముఖ్య కూడలి. దాదాపుగా రోజు కి 80 వేల నుంచి, లక్ష వరకు వాహనాలు వెళ్తాయి అనేది ఒక అంచనా. బెంజ్ సర్కిల్ ట్రాఫిక్ సమస్య తీర్చటానికి ఇక్కడ ఒక పెద్ద ఫ్లై ఓవర్ కట్టటానికి సన్నాహాలు జరుగుతున్నాయి. మన కలల రాజధాని అమరావతిలో, బెంజ్ సర్కిల్ కు ఒక ప్రత్యేక గుర్తింపు ఉండాలి అని ఆశిద్దాం!!

## మీకు తెలుసా?

**పద్యాలగురించి తెలుసు కుందాం!**

వేమన శతకం రాసింది ఎవరంటే వేమన అని టక్కున చెప్పేస్తామం. కాని సుమతి శతకం రచించింది మాత్రం చెప్పలేము. కారణం వేమన శతక పద్యాలకు విశ్వదాభి రామ వినుర వేమ అనే మకుటం ఉంటుంది. మకుటంలోని చివరి పదం..కవి వేమన పేరు ఉటుంది. అలాగే సుమతి శతకానికి సుమతీ అనే మకుటం ఉంది.కాని రాసింది సుమతి కాదు... బద్దెన. ఈ సారి బద్దెన రాసిన సుమతి శతకంలోని పద్యాలు, వాటి తాత్పర్యాల గురించి తెలుసుకుందాం!

1.శ్రీరాముని దయచేతను
నారూఢిగ సకలజనులు నౌరాఁయనగా
ధారాళమైన నీతులు
**నోరూరఁగ జీవులు వుట్ట నుడివెద సుమతీ!**

తాత్పర్యం:... ఓ మంచిబుద్ధి గలవాడా! శ్రీరాముని యొక్క దయవలన నిశ్చయముగా అందరు జనులును సేబాసనునట్లుగా, నోటి నుండి నీళ్లూరునట్లుగా, రసములు వుట్టగా న్యాయమును బోధించు నీతులను చెప్పెదను.

2.కనకపు సింహాసనమున
శునకము గూర్చుండబెట్టి శుభలగ్నమునం
దొనరగ బట్టము గట్టిన
వెనుకటి గుణమేల మాను వినురా సుమతీ!

తాత్పర్యం:.... ఓ మంచి బుద్ధిగలవాడా! కుక్కది హీనగుణము. దానిని మంచి ముహూర్తమునాడు బంగారవు సింహాసనమున కూర్చొండబెట్టిననూ హీన బుద్ధి విడవదు. అలాగే హీనుని ఉన్నత స్థానమున కూర్చొండబెట్టిననూ అతని బుద్ధి మారదు అని భావం.

3.చీమలు పెట్టిన వుట్టలు
పాముల కిరవైన యట్లు పామరుడు దగన్
హేమంబు గూడబెట్టిన
భూమీశుల పాలజేరు భువిలో సుమతీ!

తాత్పర్యం... ఓ సుమతీ భూమిలో చీమలు కష్టపడి పెట్టిన వుట్టలలో పాములు చేరును. అట్లే మూర్ఖుడు దాచి ఉంచిన బంగారం రాజులపాలై అతనికి ఉపయోగపడకపోవును.

4. తలనుండు విషము ఫణికిని
వెలయంగా దోక నుండు వృాఎశ్చికమునకున్
దలతోక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ!

తాత్పర్యం:.... ఓ సుమతీ! పామునకు తలయందు విషముండును. తేలుకు విషము తోకలో ఉండును. కానీ దుర్మార్గుడైన మనిషికి తల, తోక యనక శరీరమంతయు విషము ఉండును.

5. పుత్రోత్సాహము తండ్రికి
పుత్రుడు జన్మించినవుడె వుట్టదు జను లా
పుత్రుని కనుగొని పొగడగ
పుత్రోత్సాహంబు నాడు పొందుర సుమతీ!

తాత్పర్యం: ఓ సుమతీ! కొడుకు వుట్టగానే తండ్రికి సంతోషము కలగదు. కాని ఆ కొడుకు గొప్పవాడై ప్రజలు అతనిని పొగుడుతున్నవుడు ఆ తండ్రికి నిజమైన సంతోషము కలగును.

# వాస్తు విజ్ఞానం

8. దేశ కాలాల సమన్వయం

ఏ శాస్త్ర పరిశీలనలోనైనా దేశం, కాలం ప్రాధాన్యం వహిస్తాయి. ఉదా: ఫలానా రోగానికి ఫలాన మందు ఉపయోగపడుతుంది అని నిర్ధారించి ఉంటుంది. కాని వైద్యుడు ఆ మందును ఆ రోగి అవస్థా భేదాన్ని బట్టి చంటి పిల్లలకు ఒక విధంగాను, పెద్దలకు మరో రకంగాను మొతాదు విధిస్తాడు. అ విధంగానే గృహ నిర్మాణంలో ఉష్ణ దేశాల్లో ఒక విధమైన శైలి, శీతల ప్రాంతాల్లో మరొక విధమైన శైలిని అనుసరిస్తారు.

కాలం గడిచేకొద్ది కొన్ని సమయాల్లో విపరీతమైన మార్పులు వస్తాయి. ఒక కాలంలో అనుసరించిన నియ మం మరొక కాలంలో నిషేధిత నియమ అవుతుంది. దాని స్థానంలో కాలానికి అనుగుణమైన నియమాలను శాస్త్ర బద్ధం చేస్తారు. అవి ఆచరణీయమవుతాయి. ఉదాహర ణకు పూర్వకాలంలో అవలం భించన శ్లాబు పద్ధతి నేడు మనం అనుసరిస్తున్నాం. ఇది సర్వజనాంగీకారం. కాబట్టి శాస్త్రబద్ధం అయింది.

ప్రసాదం

ప్రసాదాలు భూమిపై నివాసాలకు అనుగుణంగా నిర్మిం చిన కట్టడాలు. ఇవి రెండు విధాలు: 1. మానవ గృహాలు, 2. దేవతా గృహాలు.

మానవ గృహాలు: 1. ఏకశాల, 2. ద్విశాల, 3. త్రిశాల, 4. చతుశ్శాలుగా నిర్మించవచ్చు. శాలా శబ్దానికి సంబంధించి, వాస్తు గ్రంథాల్లో శాల, గృహం, శాలా గృహం అనే ప్రయోగాలున్నాయి. సాధార ణంగా శాలా శబ్దాలు నివాస గృహం అనే అర్థంలో ఉంది. అంతేగాక గోశాల, గజశాల, ధాన్యశాల, భోజన శాల అనే ప్రయోగాల్లోనూ, గృహ పర్యాయంగా రతిగృహం, శయన గృహం, ఆయుధ గృహం, కోప గృహం, సమాలోచన గృహం అనే ప్రయోగాల్లోనూ కనిపిస్తుంది. ప్రస్తుత కాలంలో శాలా పదం సావిడి, చావిడి అనే అర్థాల్లో పర్యా యంగా వాడుతున్నారు.

గృహ శబ్దం మొత్తం ఇంటికి వ్యవహరిస్తున్నారు. వాస్తు అంటే గృహమనే అర్థంలో లోక ప్రసిద్ధంగా ఉంది. సమరాంగణ సూత్రాధారం 20వ అధ్యాయంలో గృహానికి గల పర్యాయ పదాలు చెప్పటం జరిగింది. అవి: ఆవాసం, సదనం, నికేతనం, మందిరం, సంస్తా నం, భవనం, వసతి, ఆలయం, నిలయం, గృహం, సద్మం, ధిష్ణ్యం, క్షయం, ఆగారం, సంశ్రయం, నీడం, గేహం, శరణం, లయనం, వేశ్మం, ఓకం, ప్రతిశ్రయం.

వ్యవహారంలో దేవతా నివాసాలకు ఆలయ శబ్దం, గ్రామ సంబంధమైన నిర్మాణాలకు శబ్దాలకు మందిర శబ్దం, ధాన్య, అన్నాధి వస్తు జాలాల్ని నిలవ ఉంచే వాటికి ఆగార శబ్దం ప్రయోగాల్లో ఉంది.

గృహంలో శాల, ఆలిందం అనే రెండు భాగాలుంటాయి. మానసారం అనే గ్రంథంలో ఎవరెవరు ఏయే గృహాలు నిర్మించాలి అనే అంశం ఉంది. 'దేవానాం..... ' అనే శ్లోకం ప్రకారం దేవతలు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, వైవ్య శూద్రులు, తాపసులు, ఆశ్రమ వాసులు, గజ, అశ్వ రథ, యోధులను బౌద్ధులు, యుగాలు, హోమాలు, శిల్పులు, గణకారులకు ఏకశాలాది నిర్మాణాలు చేయ వచ్చు.

దేవతలు, భూసురులు, ప్రభువులకు చూలి హార్మ్యమను (ఇంటిపై కట్టబడిన అందమైన గది) నిర్మిం చాలి. వైశ్య, శూద్రులకు చూలి, హర్మ్య నిర్మాణాలు నిషిద్ధం.

శాలలకు పృష్ఠభాగంలో భద్ర నిర్మాణం చేయాలి. భద్ర మంటే ఇంటికి ముందు నిర్మించే మండపం (ముఖ మండ పం).

మయ మతంలో ఈ నివాస గృహాల్లో ఎవరెక్కడ ఉం డాలో కూడా చెప్పారు. దేవతాలకు మధ్యభాగం, మానవు లకు పార్శ్వ భాగంలోనూ నివాసం ఉండాలి. ఏక శాలను దండకశాల అని కూడా అంటారు. ఈ దండక శాల స్థలంలో ఎక్కడైన ఉండవచ్చు. ఆర్వాణానుసారం యజ మాని ఆయా దిక్కులకు అనుగుణంగా శాలను నిర్మించ వచ్చు.

ద్విశాలలు : మయమతంలో ద్విశాలల గురించి చెప్పడం జరిగింది. దండక శాలలు నాలుగు విధాలుగా నాలుగు దిక్కుల్లో చెప్ప డం జరిగింది. హస్తిని, మహిషి, గావి, ఛాగలి అనే ఏక శాలలు నిర్మించాలి (తూర్పు- హస్తిని; దక్షిణం- మహిషి; పడమర- గావి; ఉత్తరం- ఛాగలి). ఈ నాలుగు విధాలైన శాలల్లో ద్విశాలలను నిర్మించేటప్పుడు మహిషి, గావి అనే రెండు శాలలను మాత్రమే కలిపి కట్టాలి. కాని ఇతర శాలలను నిర్మించరాదు. అలా నిర్మిస్తే యజమానికి హాని కలుగుతుంది. దీనినే ద్విశాల అంటారు.

ఏక శాలలను సంధించడం వల్ల పలు సంధి భేదాలతో మహా రాజాది ప్రసాదులు ఏర్పడుతున్నాయి. దానిపై అంతస్తులు నిర్మించి, భూపాలురకు దండకాది గృహ సముదాయాన్ని నిర్మించడం యోగ్యం.

మనుష్య గృహాలు తర్వాత చర్చించదగినవి దేవాల యాలు. ఈ దేవాలయాలు ద్రావిడ, వేసర, నగర అని మూడు విధాలు. ఇవి దేశాల యొక్క వివిధ పద్ధతులను అనుసరించి దేవాలయాల నిర్మాణాలను గురించి వివరిం చాయి.

3 యానం

యానం అంటే ప్రయాణ సాధనం అని అర్థం. యానం ప్రస్తుతం మూడు రకాలు. అవి: భూమిపై యానం, జలయానం, వాయుయానం.

భూమిపైన, భూమిపై ప్రయాణించే వాహనాలు గురించి అన్ని శాస్త్ర గ్రంథాల్లో చెప్పడం జరిగిందిప రథము, సిబికా తదితర విశేషాలు దీనికి సంబంధించినవే. ఈ రథాలు పలు రకాల యంత్రాలతో నిర్మించారని పురాణ, ఇతిహా సాల వల్ల తెలుస్తోంది.

సమరాంగణ సూత్రధారం 31వ అధ్యాయంలో (శ్లోకం తస్యబీజం.....) రస యంత్రాలుగా చెప్పబడే వాటిలో అనగా భూమిపై ప్రయాణించే రథాల గురించి వివరిం చారు.

మహాభారతంలో నలుడు మనసుకన్నా వేగంగా ప్రయాణం చేసే గుర్రాలు పూన్చిన వాహనంలో ప్రయాణం చేశాడని చెప్పడం జరిగింది. ఆ విద్య ఒక్క నలుడికే తెలు సునట. అంటే ప్రస్తుతం ఉన్న సూపర్ ఎక్స్‌ప్రెస్ స్పీడ్ అన్న మాట. ఆ కాలం నాటికి కీలుగుర్రాలు తదితరాలు ఉన్నాయి. రుగ్వేదంలో అశ్వినీ దేవతలు భూమిపై, జలంపై నడిచే రథంలో ప్రయాణించి చెప్పారు.

రామాయణంలో యుద్ధకాండలో రాముడు విభీష ణుడితో 'ఆ వచ్చే మహామానవాకారం (కుంభకర్ణుడు) రావణుని యంత్రశాలలో తయారు చేయబడిన యుద్ధ యంత్రమా' అని అంటాడు. అంటే ఆ కాలం నాటికే మాన వాకారంలో యుద్ధయంత్రాలు (రాబట్స్)లను తయారు చేసే విధానం ఉన్నట్లు తెలుస్తోంది.



అంతా నిన్ను అవమానిస్తున్నప్పుడు, వినయంగా వుండడం మంచిది కాదు. కానీ అందరూ నిన్ను ప్రశంసిస్తూన్నప్పుడు వినయంగా వుండడం మాత్రం చాలా అరుదయిన విషయం. -సెయింట్ బెర్నార్డ్

# నివేదా థామస్

తెలుగు, తమిళ, మలయాళ రంగాలకు సురపరిచితురాలు నివేదా థామస్. సన్ టీవీలో బాలనటిగా నటనకు శ్రీకారం చుట్టింది. మైడియర్ భూతం సీరియల్ ద్వారా మంచి గుర్తింపును పొందింది. కేరళ స్టేట్ ఫిలిం అవార్డు ఫర్ చిల్డ్రన్స్ విభాగంలో అవార్డు తీసుకోవడం విశేషం. తమిళ, మలయాళ సినిమా రంగాలకు ముందే పరిచయమైనా జెంటిల్‌మేన్ సినిమాతో తెలుగుతెరకు పరిచయం అయ్యింది.

ఆ సినిమా హిట్ అవ్వడంతో పాటు నిన్నుకోరి సినిమాలో నాని సరసన హీరోయిన్‌గా నటించడం ఆ సినిమా కూడా భారీ విజయాన్ని నమోదు చేసుకోవడంతో నివేదాథామస్ హిట్ హీరోయిన్ అనే సెంటిమెంటును కూడా సొంతం చేసుకున్నది. జూనియర్ ఎన్టీఆర్ తో జైలవకుశ సినిమాలో నటించడం విశేషం. అతి తక్కువ సమయంలో హేమాహేమీలతో సినిమాలు చేయడం అదృష్టం.

పవర్ స్టార్ పవన్ కల్యాణ్ సినిమాలో నటించే అవకాశం వస్తే ఎవరు మాత్రం వదులుకుంటారు. ఎగిరి గంతేసి, ఏ షరతులు లేకుండా ఆ సినిమాకి సైన్ చేస్తారు. కానీ తాను మాత్రం వదులుకున్నాను అంటోంది టాలీవుడ్ లేటెస్ట్ సెన్సేషన్ నివేధా థామస్. అందుకు కారణం ఆమెని పవన్ సినిమాలో హీరోయిన్ పాత్ర కోసం అడగలేదట. పవన్‌కి చెల్లి పాత్రలో నటించాల్సిందిగా అడిగారట! తాను పవన్ సినిమాలో హీరోయిన్‌గా నటించాలని కోరుకుంటున్నాను కానీ పవన్‌కి సోదరి పాత్రలో నటించాలని కాదు అని తెలిపింది నివేధా థామస్.

నివేదాథామస్ మరిన్ని హిట్ సినిమాలలో నటించి మంచి నటిగా గుర్తింపు పొందాలని సూర్య అపరంజి కోరుకుంటున్నది.









పరిపాలించడంకన్నా, ఒకరికి విధేయుడుగా వుండటమే అన్ని విధాల ఉత్తమం. -థామస్ ఎ.కెంపిస్

# అన్నా చెల్లెళ్ల అనుబంధానికి రాఖీ



భారతీయ సంప్రదాయములో రాఖి పౌర్ణమి విశిష్టమైన స్థానం కలిగివుంది. అందం, అనుబంధం కలగలసిన పండుగ రాఖీ పౌర్ణమి. ఈ పండుగకు పురాణాల ప్రకారం ఎన్నో అర్థాలున్నా....అన్నా చెల్లెళ్ల బాంధవ్యానికి, బాధ్యతకు ప్రతీకగానే దీనికి ఎక్కువ గుర్తింపు ఉంది. గతంలో ఉత్తర, పశ్చిమ భారతదేశాలలో వైభవంగా జరువుకునే ఈ పండుగను ప్రస్తుతం దేశవ్యాప్తంగా ఎంతో ఉత్సాహంగా జరువుకుంటున్నారు. అమ్మాయిలు తమ సొంత అన్నదమ్ములకు మాత్రమే రాఖీ కట్టేవారు. అలాగే, సొంతవారికే కాకుండా, తమ ఇష్టాన్ని బట్టి అన్నదమ్ముల వరసయ్యే వారికీ కడుతున్నారు. చుట్టరికంలోనే గాక, బంధుమిత్రుల పిల్లలు, పక్కింటివారు, స్నేహితులు ఇలా ఎవరికైనా రాఖీ కడుతుఎజవ్నారు. కాలేజీల్లో తమ వెంటబడి పోకిరీ వేషాలు వేసే అబ్బాయిల్ని రాఖీతో వదిలించుకునే అమ్మాయిలకీ లోటు లేదు.

### పవిత్ర ప్రేమను చాటిచెప్పే రాఖీ పౌర్ణమి...!!

మానవీయ సంబంధాలను పటిష్టం చేస్తూ.. సోదర ప్రేమకు ప్రతిరూపంగా నిలిచే 'రక్షా బంధన్ సంప్రాదాయబద్ధమైన మన విలువలను మరింత ఉట్టిపడేలా చేస్తుంది. ఉన్మాదత్వం, విచక్షనా వంటి వెకిలి చేష్టలు పేట్రేగి, మనవతా విలువులు మంటగలుస్తున్న ప్రస్తుత ఆధునిక యుగంలో 'రాఖీ పౌర్ణమి తన విశిష్టతను చాటిచెబుతూ సోదర ప్రేమ పటిష్టతకు దోహదపడుతుంది. సంస్కృతి, సాంప్రదాయాలకు ప్రతీకగా నిలుస్తుంది రాఖీ పౌర్ణమి. కేవలం అన్నాచెల్లెళ్లు .. అక్కాతమ్ముళ్లకే రక్షాబంధన్ పరిమితం కాదు. స్నేహానికి ఈ బంధనం ప్రతీకగా నిలస్తుంది. విలువలతో కూడిన ప్రేమను ఆస్వాదించే వారు ఎవరైనా సరే రాఖీ వేడుకల్లో మునిగితేలాల్సిందే. రాఖీ పర్వదినాన్ని కులమతాలకు అతీతంగా మన రాష్ట్రంతో పాటు దేశ వ్యాప్తంగా లక్షలాది మంది ప్రజలు జరువుకుంటారు. శ్రావణ మాసంలో వచ్చే పండుగ కాబట్టి ఈ పండుగను శ్రావణ పౌర్ణమిగా మరి కొందరు రాఖీ పౌర్ణమిగా పిలుస్తారు. కేరళ, తమిళనాడు, ఒరిస్సా రాష్ట్రాల్లో " ఆవని ఆవిట్టం, బిహార్, మధ్యప్రదేశ్, జార్ఖండ్, చత్తీస్ గడ్ రాష్ట్రాల్లో " కజరి పూర్ణిమగా రక్షాబంధన్‌ని నిర్వహిస్తారు. గోవా, కర్నాటక, గుజరాత్, మహారాష్ట్రాల్లో ఈ పండుగతోనే కొత్త రుతవు ప్రారంభమైనట్లు అక్కడ ప్రజలు భావిస్తారు. ఆత్మీయ బంధాలను గాలికోదిలేస్తున్న ప్రస్తుత కాలంలో బ్రిటన్, నేపాల్, కెనడా తదితర దేశాల్లో రాఖీ పౌర్ణమిని జరువుకుంటున్నారు. రాఖీపండుగ వచ్చిందంటే ఇళ్లంతా సందడి, సందడిగా ఉంటుంది. చిన్న, పెద్ద అన్న తేడా లేకుండా అన్ని వయస్సుల వారు రాఖీ పౌర్ణమిని ఘనంగా జరువుకుంటారు.

### వేడుక ఒక్కటే....పేర్లు అనేకం..

నేను నీకు రక్ష నీవు నాకు రక్ష... మనమంతా దేశానికి ధర్మానికి రక్ష అంటూ శ్రావణ పౌర్ణమి సందర్భంగా రాఖీ కడుతూ సంకల్పం చేసుకొనే గొప్ప పండుగ రక్షాబంధన్. దేశ వ్యాప్తంగా అక్కా చెల్లెళ్లందరూ తమ అన్నలు, తమ్ముళ్ళకు ప్రేమతో, ఆప్యాయతతో రాఖీ కట్టి సోదర భావాన్ని చాటే పండుగ రక్షా బంధన్. ఒరిస్సాలో రాఖీ పండుగను 'గ్రహ్మ పూర్ణిమ' అని పిలుస్తారు. ఆ రోజున వారు దైవాల్లా భావించే ఆవులు, ఎద్దులికి శుభ్రంగా స్నానం చేయించి, అలంకరణలు చేస్తారు. 'పితా' అని పిలిచే మిఠాయిలు చేసి ఇరుగుపొరుగు వాళ్లకి పంచుతారు. మహారాష్ట్ర, గుజరాత్, గోవాలలో ఈ రోజును 'నారియల్ పూర్ణిమ' అంటారు. బాగా వర్షాలు పడాలని వరుణదేవుణ్ని, సముద్రుణ్ని పూజిస్తారు. జాలరులు ఈ రోజు నుంచే చేపలు పట్టే కాలం ప్రారంభమైనట్టు భావిస్తారు. ఉత్తరాఖండ్‌లోని ప్రజలు 'జనోవున్యు' పేరుతో రాఖీ పండుగను చేసుకుంటారు. తమ పవిత్రమైన జంధ్యాన్ని మారుస్తారు.

### శ్రావణ పూర్ణి ప్రత్యేకత...

హిందూ సంప్రదాయంలో శ్రావణపూర్ణిమకు ఎంతో ప్రత్యేకత ఉంది. దీనిని రాఖీపౌర్ణమిగానే కాదు... జంధ్యాల పూర్ణిమ, వైఖానస మహర్షి జయంతి గాను, హయగ్రీవ జయంతి గాను, వరుణ పూజల రూపంలో జరువుకుంటుంటారు. ప్రతి సంవత్సరం శ్రావణమాసంలో వచ్చే ఈ పండుగ రోజున యజ్ఞోపవీతం సంప్రదాయం ఉన్నవారు, ఈ రోజు నూతన జంధ్యాలు ధరిస్తారు. ఇదే రోజున బ్రాహ్మణులు నూతన యజ్ఞోపవీతధారణలు చేసి విద్యార్థులకు వేదపఠనం ప్రారంభిస్తారు. అందుకే శ్రావణ పూర్ణిమకు జంధ్యాల పూర్ణిమ అనే పేరు వాడుకలోకి వచ్చింది. వేదపండితులు వేదాలను వల్లెవేయడం అంటే.. ఆ వృత్తిని ప్రారంభించడం, ప్రారంభ ముక్కును-చివరి ముక్కును ఇదే రోజున పఠించడం చేస్తారు. రోజులు మారడం, సంప్రదాయాల్లో మార్పులు కారణంగా ఈ పేర్లు వాడుకనుంచి తప్పుకున్నాయి. చివరకు ఇది రక్షాబంధన్ లేక రాఖీ పండుగగా ప్రాచుర్యం పొందింది. శ్రావణ పూర్ణిమ నాడు పూర్వం యుద్ధానికి వెళ్ళే వీరునికి విజయం ప్రాప్తించాలని ఆశిస్తూ ఈ రక్షాబంధననను కట్టే వారని పురాణాలు చెబుతున్నాయి.

### ఎలా ప్రారంభమైందంటే..?

పూర్వం దేవతలకు - రాక్షసులకు మధ్య పుష్కరకాలం యుద్ధము సాగింది. ఆ యుద్ధములో ఓడిపోయిన దేవతల రాజు దేవేంద్రుడు నిర్వీర్యుడై తన పరివారమంతటిని కూడగట్టుకుని 'అమరావతి' లో తలదాచుకుంటాడు. అట్టి భర్తనిస్సహాయతను గమనించిన ఇంద్రాణి 'శచీదేవి' తగు తరుణోపాయమునకై ఆలోచిస్తూ ఉన్న సమయాన ఆ రాక్షసరాజు చివరకు 'అమరావతి'ని కూడా దిగ్బంధన చేయబోతున్నాడు అని గ్రహించి, భర్త దేవేంద్రునకు 'సమరోత్సాహము' పురికొలిపిందట. సరిగా ఆరోజు శ్రావణ పూర్ణిమ అగుటచేత 'పార్వతీ పరమేశ్వరులను', లక్ష్మీ నారాయణులను పూజించి ఆ పూజించబడిన రక్షా దేవేంద్రుని చేతికి కడుతుందట. అది గమనించిన దేవతలందరు వారు పూజించిన రక్షలు తెచ్చి ఇంద్రునకు కట్టి ఇంద్రుని విజయయాత్రకు అండగా నిలచి, తిరిగి 'త్రిలోకాధిపత్యాన్ని' పొందారు. ఆనాడు శచీదేవి ప్రారంభించిన 'ఆ రక్షాబంధనోత్సవం' నేడు అది 'రాఖీ' పండుగగా ఆచారమైందని పురాణాలు చెబుతున్నాయి.

### పవిత్రమైన రాఖీ ...

భార్య- భర్తకు, సోదరి- సోదరులకు కట్టే రక్షాబంధన్ ద్వారా వారు వారు తలపెట్టే కార్యములు విజయవంతమై సుఖసంపదలు కలగాలని, వారి మాన మర్యాదలకు సోదరుడు/భర్త బాసటగా నిలవాలని ఆకాంక్షించే సత్ సంప్రదాయమే ఈ 'రాఖీ'. అలా రాఖీలు కట్టించుకున్న భర్తలు, సోదరులు వారికి నూతన వస్త్రాలు, చిరుకానుకలు సమర్పించి, అందరు కలసి చక్కని విందు సేవిస్తారు. ఇదిలా ఉంటే... పూర్వం విదేశీయులు మనదేశాన్ని పాలిస్తున్న రోజులలో మొగాలాయిాల దుర్నీతికి దురంతాలకు ఏమాత్రం అడ్డూ అవూ అనేది లేకుండా పోయేది. హిందూ జాతి వారి కబంధహస్తాలలో నలిగిపోయేది. స్త్రీలు వారి మాన ప్రాణరక్షణకై వీరులైన యోధులను గుర్తించి వారికి 'రక్షాబంధనం' కట్టి వారు చూసే సోదర భావముతో, రక్షణ పొందేవారు. ఒకసారి 'రాణి కర్ణావతి' శత్రువులు తన దుర్గాన్ని ముట్టడించినప్పుడు 'ఢిల్లీపాదుషాకు' రాఖీ పంపగా ఆమెను సోదరిగా భావించి శత్రువులను తరిమికొట్టి ఆ సోదరి ఇంట పాదుషా భగినీ హస్తభోజనంచేసి, కానుకలు సమర్పించినట్లు గాథలు ఉన్నాయి.

### పురాణ గాథల్లో...చరిత్ర పుటల్లో...

బలి చక్రవర్తి విష్ణ భక్తుడు. తన అపరిమిత భక్తితో విష్ణుమూర్తిని తన వద్దే ఉంచేసుకున్నాడు. దాంతో వైకుంఠం వెలవెల పోయింది. లక్ష్మీదేవి బాగా ఆలోచించి, రాఖీ బంధన్ రోజున బలి చక్రవర్తికి రాఖీ కట్టింది. బలి, భ్రాతృ ప్రేమతో ఏం కావాలమ్మా అని అభిమానంగా అడిగాడు. లక్ష్మి వెంటనే విష్ణుమూర్తి కావాలని కోరింది. బలి మనసు ఆర్ద్రమైంది. సర్వం త్యాగం చేసి, లక్ష్మీదేవితో విష్ణుమూర్తిని వెంట తీసికెళ్ళమన్నాడు.

వినాయకునికి సిద్ధి, బుద్ధి అనే ఇద్దరు భార్యలు, శుభ్, లాభ్ అనే ఇద్దరు కొడుకులు. రక్షా బంధన్ రోజున, గణపతి చెల్లెలు వచ్చి ఆయనకు రాఖీ కట్టింది. అది చూసిన శుభ్, లాభ్, తల్లిదండ్రులను తమకో చెల్లెలు కావాలని కోరారు. గణపతి సంతకృప్తికి సంకేతం అయిన సంతోషీ మాతను ప్రార్థించగా ఆవిడ ఒక దివ్య శక్తిని ప్రసాదించింది. అందుకే సోదరి రాఖీ కట్టడాన్ని శక్తి స్వరూపిణి తనకు రక్షగా ఉందని సోదరుడు భావిస్తాడు. ఆమె ఆకాంక్షలే తనకు శ్రీరామ రక్షగా ముందుకు సాగుతాడు.

మహాభారతం ప్రకారం ద్రౌపదికి, వస్త్రాపహరణం సమయంలో, మహా రాజ్యాధిపతి అయిన తండ్రి ద్రుపద రాజు కానీ, ఉద్దండులయిన ఐదుగురు భర్తలు కానీ గుర్తు రాలేదు. తనను ఆదుకునేవాడు కృష్ణుడే అనుకుంది. ఆర్తిగా, నిస్సహాయంగా శ్రీకృష్ణుడిని ప్రార్థించింది. కృష్ణుడు ఆ క్షణంలో ద్రౌపదికి తరగని వస్త్రాన్ని ప్రసాదించి, అవమానం నుండి తప్పించాడు. ఇది రాఖీ బంధనాన్ని సూచిస్తుంది.

భారతంలోని దుష్యంతోపాఖ్యానంలో కూడా ఈ రక్షాబంధన వృత్తాంతం ఉంది. కుమారుడైన భరతునికి శత్రుభయం లేకుండా శకుంతల రక్ష కట్టింది. ఆ రక్ష మూలంగానే తదుపరి విధివశాత్తు విడిపోయిన శకుంతలా దుష్యంతుల పునఃస్సమాగమం సిద్ధించడమేగాక భరతుని విజయానికి ి కూడా సహకరించింది. అంతేకాదు, శ్రీకృష్ణుని హితోపదేశానుసారం ధర్మరాజు కూడా ఈ రక్ష ధరించినట్లు భారత గాథ చెబుతోంది.



### రక్షని కట్టే సమయం..

శ్రావణ పూర్ణిమ నాటి నుండి ఒక సంవత్సరం పాటు ఎవరికీ అండగా ఉండదలచామో వారి ముంజేతికి మనం కట్టబోయే రక్షిక (రాఖి)ను దైవం ముందుంచి పూజించి, ఆ పూజా శక్తిని గ్రహించిన రక్షికను అపరాహ్ణసమయం లో కట్టడం చేయాలి. అప అంటే పగలు అపరం అంటే మధ్యాహ్నం అంటే 12 దాటాక , కాబట్టి అపరాహ్ణం అంటే 12 నుండి 3 గంటల మధ్య. ఈ విధానాన్ని గర్గ్యుడనే మహర్షి చెప్పాడని శాంతి కమలాకరం చెప్తోంది కాబట్టి ఇది నేటి ఆచారం కాదనీ, ఎప్పటి నుండో వస్తున్న సంప్రదాయమేనని తెలుస్తోంది.రక్ష బంధనానికి ప్రత్యక్ష సాక్షి సూర్యుడు. అందుకే మధ్యాహ్న సమయం లో రక్షని కడతారు . మరో ముఖ్య విశేషం ఏమిటి అంటే ఇది కేవలం స్త్రీలు మాత్రమే కట్టాలని నియమం ఎక్కడా లేదు. స్త్రీలకి స్త్రీలు, పురుషులకి పురుషులు కూడా కట్టొకోవచ్చు. ఇలా అండగా నిలవాలనే పవిత్రోద్దేశ్యం ఉంటే చాలు.

ద్వాపర యుగంలో శ్రీకృష్ణ పరమాత్ముడు కార్యోన్ముఖుడై బయలుదేరుతూ తన సోదరి సుభద్రా దేవితో రక్ష కట్టించుకొని విజయాన్ని సాధించినట్లు చెప్తాడు. తర్వాత విజయానికి ప్రతీకగా ఆమెకు అనేక కానుకలు సమర్పించాడట. అప్పటి నుంచి ఈ బంధం సోదరీ సోదరుల విజయబంధంగా వర్ధిల్లుతోంది.

భారతదేశాన్ని ఆక్రమించడానికి వచ్చిన అలెగ్జాండర్ తెలుసుగా! అతణ్ని కూడా ఓ సారి రాఖీ కాపాడింది. సువారం క్రీస్తు పూర్వం 326లో గ్రీస్ రాజైన అలెగ్జాండర్ తన సేనలతో



మన దేశం మీదకి దండెత్తి వచ్చాడు. ఇక్కడే రోక్సానా అనే యువతిని పెళ్లిచేసుకున్నాడు. ఓసారి పురుషోత్తముడు అనే భారత రాజుతో యుద్ధానికి సిద్ధమయ్యాడు అలెగ్జాండర్. పురుషోత్తముని పరాక్రమం గురించి ముందే తెలుసుకున్న రోక్సానా ఆ చక్రవర్తికి ఓ రాఖీని పంపి, తన భర్తను ఏం చేయద్దని కోరింది. యుద్ధంలో అలెగ్జాండర్ మీదకి కత్తి ఎత్తిన పురుషోత్తముడు తన చేతి మణికట్టుకి ఉన్న రాఖీని చూసి అలెగ్జాండర్‌ని చంపకుండా వదిలివేశాడు.

1535లో రాణీ కర్ణావతి భర్త చనిపోయాడు. దాంతో గుజరాత్ సుల్తాన్ బహదూర్ షా, చిత్తూరుపై కన్నేశాడు. ఏ క్షణాన అయినా సుల్తాన్ దండెత్తిరావచ్చని గూఢచారుల ద్వారా విన్న రాణీ కర్ణావతి భయపడింది. బాగా ఆలోచించి, తనను కాపాడేవాడు మొఘల్ సామ్రాజ్యాధిపతి హుమాయూన్ చక్రవర్తే అని నమ్మింది. వెంటనే హుమాయూన్ చక్రవర్తికి రాఖీ పంపింది. ఆ రాఖీ హుమాయూన్ మనసును గెలిచింది. కానీ అప్పటికే గుజరాత్ సుల్తాన్ చిత్తూరు కోటపై దాడి చేశాడు. హుమాయూన్ కు విషయం అర్థం అయ్యేసరికి పరిస్థితి విషమించింది. రాణీ కర్ణావతితో సహా 13 వేలమంది స్త్రీలను సుల్తాన్ చేర పట్టాడు.



### పవిత్రమైన రాఖీ ...

భార్య- భర్తకు, సోదరి- సోదరులకు కట్టే రక్షాబంధన్ ద్వారా వారు వారు తలపెట్టే కార్యములు విజయవంతమై సుఖసంపదలు కలగాలని, వారి మాన మర్యాదలకు సోదరుడు/భర్త బాసటగా నిలవాలని ఆకాంక్షించే సత్ సంప్రదాయమే ఈ 'రాఖీ'. అలా రాఖీలు కట్టించుకున్న భర్తలు, సోదరులు వారికి నూతన వస్త్రాలు, చిరుకానుకలు సమర్పించి, అందరు కలసి చక్కని విందు సేవిస్తారు. ఇదిలా ఉంటే... పూర్వం విదేశీయులు మనదేశాన్ని పాలిస్తున్న రోజులలో మొగాలాయిాల దుర్నీతికి దురంతాలకు ఏమాత్రం అడ్డూ అవూ అనేది లేకుండా పోయేది. హిందూ జాతి వారి కబంధహస్తాలలో నలిగిపోయేది. స్త్రీలు వారి మాన ప్రాణరక్షణకై వీరులైన యోధులను గుర్తించి వారికి 'రక్షాబంధనం' కట్టి వారు చూసే సోదర భావముతో, రక్షణ పొందేవారు. ఒకసారి 'రాణి కర్ణావతి' శత్రువులు తన దుర్గాన్ని ముట్టడించినప్పుడు 'ఢిల్లీపాదుషాకు' రాఖీ పంపగా ఆమెను సోదరిగా భావించి శత్రువులను తరిమికొట్టి ఆ సోదరి ఇంట పాదుషా భగినీ హస్తభోజనంచేసి, కానుకలు సమర్పించినట్లు గాథలు ఉన్నాయి.

హుమాయూన్ చిత్తూరు చేరేసరికి మహిళలందరూ ఆత్మహత్యకు పాల్పడ్డారు. హుమాయూన్ చక్రవర్తి, గుజరాత్ సుల్తాన్ను ఓడించి, చిత్తూరు రాజ్యాన్ని రాణీ కర్ణావతి కొడుక్కు ఇప్పించాడు. హుమాయూన్ కు మాత్రం ఆమె పంపిన రాఖీ తీపి గుర్తుగా మిగిలిపోయింది.

### రక్షని కట్టే సమయం..

శ్రావణ పూర్ణిమ నాటి నుండి ఒక సంవత్సరం పాటు ఎవరికీ అండగా ఉండదలచామో వారి ముంజేతికి మనం కట్టబోయే రక్షిక (రాఖి)ను దైవం ముందుంచి పూజించి, ఆ పూజా శక్తిని గ్రహించిన రక్షికను అపరాహ్ణసమయం లో కట్టడం చేయాలి. అప అంటే పగలు అపరం అంటే మధ్యాహ్నం అంటే 12 దాటాక , కాబట్టి అపరాహ్ణం అంటే 12 నుండి 3 గంటల మధ్య. ఈ విధానాన్ని గర్గ్యుడనే మహర్షి చెప్పాడని శాంతి కమలాకరం చెప్తోంది కాబట్టి ఇది నేటి ఆచారం కాదనీ, ఎప్పటి నుండో వస్తున్న సంప్రదాయమేనని తెలుస్తోంది.రక్ష బంధనానికి ప్రత్యక్ష సాక్షి సూర్యుడు. అందుకే మధ్యాహ్న సమయం లో రక్షని కడతారు . మరో ముఖ్య విశేషం ఏమిటి అంటే ఇది కేవలం స్త్రీలు మాత్రమే కట్టాలని నియమం ఎక్కడా లేదు. స్త్రీలకి స్త్రీలు, పురుషులకి పురుషులు కూడా కట్టొకోవచ్చు. ఇలా అండగా నిలవాలనే పవిత్రోద్దేశ్యం ఉంటే చాలు.

శ్రావణ పూర్ణిమ లేదా రాఖీ పూర్ణిమ రోజున అక్కచెల్లెళ్ళు తమ అన్నదమ్ముల ముఖాన తిలకం దిద్ది, చేతికి ప్రేమ గా రాఖీ కట్టి, వి ఠాయి తినిపిస్తా రు. సోద రులు తమ శక్తికొద్దీ కానుక ఇస్తారు. ఒకరికొకరు స్వీటు తినిపించుకున్నాక అందరూ కలిసి విందు భోజనం చేస్తారు. సోదరులు దూర ప్రాంతాల్లో ఉంటే, రాఖీలను పోస్టులో పంపిస్తున్నారు. మనసుంటే మార్గం ఉంటుంది మరి.

### వేడుక ఒక్కటే....పేర్లు అనేకం..

నేను నీకు రక్ష నీవు నాకు రక్ష... మనమంతా దేశానికి ధర్మానికి రక్ష అంటూ శ్రావణ పౌర్ణమి సందర్భంగా రాఖీ కడుతూ సంకల్పం చేసుకొనే గొప్ప పండుగ రక్షాబంధన్. దేశ వ్యాప్తంగా అక్కా చెల్లెళ్లందరూ తమ అన్నలు, తమ్ముళ్ళకు ప్రేమతో, ఆప్యాయతతో రాఖీ కట్టి సోదర భావాన్ని చాటే పండుగ రక్షా బంధన్. ఒరిస్సాలో రాఖీ పండుగను 'గ్రహ్మ పూర్ణిమ' అని పిలుస్తారు. ఆ రోజున వారు దైవాల్లా భావించే ఆవులు, ఎద్దులికి శుభ్రంగా స్నానం చేయించి, అలంకరణలు చేస్తారు. 'పితా' అని పిలిచే మిఠాయిలు చేసి ఇరుగుపొరుగు వాళ్లకి పంచుతారు. మహారాష్ట్ర, గుజరాత్, గోవాలలో ఈ రోజును 'నారియల్ పూర్ణిమ' అంటారు. బాగా వర్షాలు పడాలని వరుణదేవుణ్ని, సముద్రుణ్ని పూజిస్తారు. జాలరులు ఈ రోజు నుంచే చేపలు పట్టే కాలం ప్రారంభమైనట్టు భావిస్తారు. ఉత్తరాఖండ్‌లోని ప్రజలు 'జనోవున్యు' పేరుతో రాఖీ పండుగను చేసుకుంటారు. తమ పవిత్రమైన జంధ్యాన్ని మారుస్తారు.

చంపావత్ అనే జిల్లాలో బగ్వాల్ పేరుతో పెద్ద ఉత్సవాన్ని నిర్వహిస్తారు. మధ్యప్రదేశ్, ఛత్తీస్‌గడ్, జార్ఖండ్, బీహార్‌లలో 'కజరి పూర్ణిమ' అని పిలుస్తారు. ఇది రైతులకి, కొడుకులున్న తల్లులకి చాలా ముఖ్యమైన పండగ. గుజరాత్‌లో కొన్ని ప్రాంతాల్లో 'పవిత్రోపన' పేరుతో పండుగను నిర్వహిస్తారు. ఈ రోజున శివుని గురించి ప్రజలందరూ పూజ చేస్తారు.

### రాజకీయ పూర్ణిమగా...

రాఖీ అనగానే సోదరీసోదరుల అనుబంధం గుర్తుకు వస్తుంది. అన్నాచెల్లెల్ల అఆనుబంధం అనేది మనకు ఓ గొప్ప సెంటిమెంట్. ఎంత సెంటిమెంట్ అంటే ఈ పండుగ ప్రస్తావన ఉన్న సినిమాలన్నీ హిట్టే. రాఖీ .... పేరుతో తీసిని జూనియర్ ఎన్టీఆర్ సినిమా ఎంత బ్లాక్‌బస్టర్ హిట్టయిందో తెలిసిందే...అంతే కాదు ఆ సెంటిమెంటు ఎంపీ కవిత ఆలోచనతే ఓ మోస్తరు రాజకీయ రంగు పులుముకుందని చెప్పక తప్పదు. టీఆర్ఎస్ ఎంపీ కవిత.. వెరీ వెరీ స్పెషలిస్టు లీడర్..ఏం చేసినా నలుగురు చెప్పుకోవాల్సిందే. మాటల్లో మ్యాజిక్..చేతల్లో చమక్కులుటోటల్ గా సంథింగ్ స్పెషల్. ఆమె స్పెషాలిటిని ఈసారి రాఖీ పూర్ణిమతో జతచేసింది. ఇప్పుడో కొత్త కాన్సెప్ట్ తో జనం ముందుకు వచ్చింది. అంతేకాదు సమాజానికి ఉపయోగపడే ఆమె కాన్సెప్ట్ అందరినీ ఆలోచింపజేస్తోంది. కేటీఆర్ బర్త్ డే సందర్భంగా సిస్టర్స్ ఫర్ ఛేంజ్..క్యాంపెయిన్ మొదలుపెట్టారు కవిత. అందరు అక్కచెల్లెళ్లు, అన్నతమ్ముళ్లని ఇందులో భాగస్వాముల్ని చేస్తున్నారు. ఇంతకీ ఏం చేయాలంటే రాఖీ కట్టడంతో పాటు హెల్మెట్ ను గిఫ్ట్ కూడా ఇవ్వాలని కవిత సూచిస్తున్నారు. ప్రస్తుతం రోడ్డు ప్రమాదాల్లో రోజుకు 4 వందల మంది చనిపోతున్నారు. హెల్మెట్ పెట్టుకోకపోవడంతోనే వీరి ప్రాణాలు పోతున్నాయి. అందుకే వీటిని నివారించాలంటే హెల్మెట్ మస్ట్ గా పెట్టుకోవాల్సిందే. ఇకనుంచి హెల్మెట్ తో బండెక్కిన అన్నకు ఎప్పుడు చెల్లమ్మా రక్షణగా ఉంటుంది. టీఆర్ఎస్ ఎంపీ కవిత చేస్తున్న ఈ పనికి హ్యాట్సాప్ చెప్పాల్సిందే..అందరూ మస్ట్ గా ఫాలో కావాల్సిందే..ఏదైనా చేయాలంటే ప్రాణాలు ఉండాలి కదా!

# అలనాటి తారలు

జయచిత్ర ఈ పేరు వింటే అందానికి అర్థం గుర్తుకు వస్తుంది. ఆకాలం హీరోయిన్స్ లో టాప్ మోస్ట్ బ్యూటీఫుల్ హీరోయిన్ అంటే జయచిత్రానే గుర్తుకు వస్తుంది... హీరోయిన్ గా చేసే రోజుల నుండి క్యారక్టర్ ఆర్టిస్టుగా.. చివరికి అమ్మ క్యారక్టర్లు వేసే వరకు ఆమె ఎప్పటిలాగానే అందంగా మెరిసి పోయింది... 1972 లో తమిళ సినిమాతో ఇండస్ట్రీలోకి అడుగు పెట్టిన జయచిత్ర తమిళ స్టార్ హీరోలు అందరితో సినిమాలు చేసింది.. 1972 లో సోగ్గాడుతో తెలుగు చిత్ర రంగ ప్రవేశం చేశారు... అప్పటి నుండి ఎన్టీఆర్, ఎఎన్నార్, శోభన్ బాబు, కృష్ణం రాజు, లాంటి స్టార్ల పక్కన హీరోయిన్ గా చేసింది.. ఆతరువాత బాలకృష్ణ, వెంకటేష్ లాంటి స్టార్ హీరోలకు మొదట్లో తల్లి పాత్రలు వేశారు జయచిత్ర. అబ్బాయిగారు మూవీలో వెంకటేష్ తల్లిగా.. లేడీవిలన్‌గా ఆమె పండించిన నటన అద్భుతం.. జయచిత్రగా ప్రసిద్ధిచెందిన తెలుగు సినిమా నటి పూర్తి పేరు లక్ష్మి కృష్ణవేణి రోహిణి పార్వతీదేవి. ఈమె తల్లి అమ్మాజీ (తెలుగు సినిమాలలో జయశ్రీ) కూడా ఒక నటీమణి. ఈమె బాల్యంలో పాదుకాపట్టాభిషేకం సినిమాలో చిన్నప్పటి సీతగా, భక్తపోతన సినిమాలో పోతన కుమార్తెగా, జీవితం... సినిమాలో శోభన్‌బాబు కూతురుగా నటించింది. ఈమె మద్రాసులో విద్యోదయా స్కూలులో పదవ తరగతి వరకు చదివింది. ఈమె చిన్నతనం నుండే వళువూర్ రామయ్య పిళ్ళై, వెంపటి చినసత్యం, ఎమ్.ఎస్.శైవా లవద్ద నృత్యాన్ని అభ్యసించింది. ఒకవైపు చదువుకుంటూనే తమిళచిత్రాలలో నటిస్తూ వచ్చింది. తరువాత సోగ్గాడు చిత్రంతో తెలుగు సినిమాలలో కథానాయికగా నటప్రస్థానాన్ని ప్రారంభించింది. ఈమె ఇంచుమించు 200 పైగా సినిమాలలో నటించింది. తమిళనాడు ప్రభుత్వం ఈమెకు కళైమామణి పురస్కారం ఇచ్చి సత్కరించింది. 2005 వరకు నటించిన జయచిత్రం ఆ తరువాత తెరమరుగు అయ్యారు.. చెన్నైలో ఉంటున్నట్టు సమాచారం. ప్రస్తుతం ఆమె ఎక్కువగా ఎవరికి కనిపించడం లేదు. కాని సినీ ప్రేక్షకుల మనో ఫలకాల మీద మాత్రం చెరగని ముద్రవేశారు.





నటి జయంతి ..సినీరంగంలో పరిచయం అక్కర లేని పేరు..... ఆ తరం నటీమణుల్లో ఆణిముత్యం ఆమె హీరోయిన్ దగ్గర నుండి క్యారక్టర్ ఆర్టిస్ట్ వరకు ఆమె చేసిన పాత్రలన్ని వన్నెతెచ్చినవే...ఎంతో మంది హీరోలతో స్క్రీన్ షేర్ చేసుకున్నారు జయంతి. ఆమె నటన అమోఘం. తెరపై ఆమె కంట తడిపెట్టిందంటే.. స్క్రీన్ ముందు కూర్చున్న ప్రేక్షకుల కర్చీఫ్‌లు తడిసి మద్దవ్వాల్సిందే. అంత సహజంగా ఉంటుంది ఆమె నటన. డాన్సర్ గా తన కెరీర్ ను స్టార్ట్ చేసిన జయంతి అనుకోకుండా నటి అయ్యారు. హీరోయిన్ గానే కాకుండా వదినగా, తల్లిగా, భామ్మగా ఇలా రకరకాల పాత్రలను పండించి తెలుగు ప్రేక్షకులను అలరించారు జయంతి. కొండవీటి సింహంలో తండ్రీ కొడుకుల మధ్య నలిగిపోయిన తల్లిగా ఆమెన నటన అపూర్వం. రాను రాను సినిమాలు తగ్గడంతో జయంతి కనుమరుగైపోయారు.. ఎప్పుడు ఏ సినమా ఫంక్షన్ లో కూడా కనిపించని జయంది.. బెంగుళూరులో కుటుంబంతో కలిసి ఉంటున్నట్టు సమాచారం. జయంతి కర్ణాటక లోని బళ్ళారిలో జన్మించింది. తండ్రి బాలసుబ్యమణ్యం బెంగుళూరులోని సెయింట్ జోసెఫ్ కళాశాలలో ఇంగ్లీషు ప్రొఫెసర్ గా పనిచేశారు. తల్లి సంతానలక్ష్మి. జయంతి వారికి ముగ్గురు పిల్లలలో పెద్ద కూతురు. తనకు ఇద్దరు తమ్ముళ్ళు. చిన్నతనంలోనే తల్లిదండ్రులు వేరుకావడం వలన జయంతిని తీసుకొని తల్లి మద్రాసు చేరింది. సంతానలక్ష్మికి తన కూతుర్ని నాట్యకళాకారినిగా చేయాలని కాంక్ష. మద్రాసులో బడికి వెళ్తూ కమలకుమారి నాటి ప్రముఖ నర్తకి, నాట్య విదుషీమణి చంద్రకళ వద్ద నాట్యం నేర్చుకోసాగింది. ఒకనాడు కన్నడ సినిమా షూటింగ్ చూడడానికి స్కూలు విద్యార్థినులతో వెళ్ళింది. ప్రముఖ కన్నడ చిత్ర దర్శకుడు వై.ఆర్.స్వామి కమలకుమారి రూపురేఖల్ని చుసి జేనుగూడు ...అనే సినిమాలోని ముగ్గురు నాయికల్లో ఒకరిగా ఎంపిక చేశారు. కమలకుమారి పేరు లోగడ చాలామందికి అచ్చిరాలేదని ఆమె పేరును జయంతిగా మార్చారు. బడి పిల్లలతో కలిసి మద్రాసుకు విహారయాత్ర వెళ్ళినప్పుడు అప్పటి సూపర్ స్టార్ ఎన్.టి.రామారావు కాస్సేపు ముచ్చటించిన తర్వాత బొద్దుగా, ముద్దుగా కనిపిస్తున్న కమలకుమారిని దగ్గరకు తీసుకుని 'నాతో సినిమాలలో హీరోయిగ్ గా వేస్తావా' అని యథాలాపంగా అన్నారు. పన్నెండేళ్ళ కమలకుమారి బుగ్గలు ఎరుపెక్కాయి. ఆ అమ్మాయి సిగ్గుతో ముఖం కప్పుకొంది. తర్వాత కాలంలో ఆనాటి కమలకుమారి జగదేకవీరుని కథ కులగౌరవం, కొండవీటి సింహం, జస్టిస్ చౌదరి చిత్రాలలో ఎన్టీఆర్ సరసన నాయికగా నటించారు. చిన్నచిన్నవేషాలు వేస్తున్న రోజుల్లో కొంతమంది నిరుత్సాహ పరిచినా పట్టుదలతో కష్టపడి పైకొచ్చింది. కన్నడ చిత్రసీమలో జయంతి స్థానం ఉన్నతమైనది. ఈమె కన్నడ మెగా హీరో రాజ్ కుమార్తో అందరు హీరోయిన్లకన్నా ఎక్కువగా 30 సినిమాలలో నటించారు. ఆమె మాతకృభాష తెలుగైనా కన్నడం చాలా చక్కగా మాట్లాడేవారు. అంతెందుకు అమెను అసలైన కన్నడ నటి అని కన్నడ ప్రేక్షకులు భావించేవారు.



తనకి తాను యజమాని కాలేని మనిషి ఎన్నటికీ స్వతంత్రుడు కాలేడు - ఎపిక్టిలస్

## కథ




# బ్రహ్మహత్యాపాతకం ఎవరికి చుట్టుకుంటుంది

విక్రమార్కుడు మళ్ళీ భేతాళుణ్ణి బంధించాడు. భేతాళుడు మళ్ళీ మరో కథ ప్రారంభించాడు. ఒకప్పుడు అవినాశి అనే నగరం ఉండేది. (వినాశం లేనిది అని ఆ పేరుకి అర్థం.) ఆ నగరంలో దేవనాథుడు అనే బ్రాహ్మణుడుండే వాడు. అతడి కొక కుమారుడు, అర్జున స్వామి. అతడు రూపవంతుడూ, గుణవంతుడు. అతడికి యుక్త వయస్సు వచ్చాక తండ్రి దేవనాథుడు, ఎన్నో ఊళ్ళు వెదికి తగిన కన్యని తెచ్చి వివాహం చేసాడు. ఆ పిల్ల పేరు అనామతి. ఆమె అర్జునస్వామికి రూపంలోనూ, గుణంలోనూ తగిన భార్య. తీయని మాటలూ, చక్కని చేతలూ గలది. యువ దంపతులని చూసిన ఎవ్వరైనా వారు ఒకరికొకరు తగి ఉన్నారనే వారు. గువ్వల జంట వంటి ఆ యువజంట, ఎప్పుడూ కలిసి మెలిసి ఉండేవాళ్ళు. ఏ పని చేసినా కలిసి చేసేవాళ్ళు. క్షణమైనా ఒకరినొకరు ఎడబాయక ఉండేవాళ్ళు. వారి తీరుని చూసి అందరూ ముచ్చట పడే వాళ్ళు. ఇలా ఉండగాఓ నాటి రాత్రచల్లగాలి వీస్తోందని భార్యభర్తలిద్దరూ, పెరట్లో మల్లెపందిరి ప్రక్కనే మంచం వేసుకు పడుకున్నారు. అది వెన్నెల రాత్రి! అర్జునస్వామి, అనామతి ఆరుబయట ఆదమరిచి నిదురిస్తున్నారు. ఆ సమయంలో ఆకాశంలో ఓ రాక్షసుడు వెళ్తోన్నాడు. అతడు భీకరంగా ఉన్నాడు. అతడి చూపులు అంతకంటే క్రూరంగా ఉన్నాయి. దిగువకి చూసిన రాక్షసుడి కళ్ళు ఒక్కసారిగా మెరిసాయి. అతడికి అనామతి అద్భుతంగా అనిపించింది. ఆమె అందానికి అదిరిపోయాడు. అమాంతం క్రిందికి దిగి, ఆమెని ఎగరేసుకు పోయాడు. రాక్షస మాయ కారణంగా అనామతికి గానీ, అర్జునస్వామి గానీ నిద్రాభంగం కాలేదు.




తెల్లవారింది. అందరి కంటే ముందే లేచి గృహకృత్యాలలో నిమగ్నమయ్యే అనామతి ఏది? నిద్రలేచిన అర్జునస్వామికి భార్య ఎక్కడా కనబడలేదు. కుటుంబ సభ్యులంతా కూడా వెతికినా అనామతి జాడలేదు. ఎవరికీ ఏమీ తోచలేదు. కీడెంచి మేలెంచమని, ఊళ్ళోని చెరువులూ నూతులూ కూడా గాలించారు. బంధుమిత్రులందరినీ వాకబు చేసారు. ఆమె ఆచూకీ తెలియ లేదు. అర్జునస్వామికి దుఃఖం కట్టలు దాటింది. అతడు ఎలాగైనా భార్య జాడ తెలుసుకోవాలని నిర్ణయించుకున్నాడు. దాంతో దేశాటనం బయలుదేరాడు. అనామతి గురించి వెతుకుతూ ఎన్నో ప్రదేశాలు, ఊళ్ళూ, అడవులూ గాలించాడు. ఏ మాత్రం ఉపయోగం లేకపోయింది. నిరాశా నిస్పృహలతో, స్వంత ఊరు అవినాశికి తిరుగు ప్రయాణమయ్యాడు. లోలోపల మిణుకు మిణుకు మంటూ ఓ చిరు ఆశ ఒక వేళ ఈ పాటికి అనామతి ఇల్లు చేరిందేమోనని. తిరుగు ప్రయాణంలో, అలసటతోనూ, ఆకలి తోనూ ఉన్నాడు. అప్పటికి ఓ గ్రామం చేరాడు. ఓ బ్రాహ్మణ గృహం ఎంచుకొని భోజనం పెట్టమని అడిగాడు. గృహస్థు భార్యని పిలిచి అతిథికి భోజనం పెట్టు అని చెప్పాడు. ఆ గృహిణి అతడికి భోజనం వడ్డించే ప్రయత్నం చెయ్యబోగాఅర్జున స్వామి అమ్మా! స్నాన సంధ్యలు ముగించుకొని ఆరగిస్తాను. భోజనం కట్టి ఇవ్వు అని అర్థించాడు. గృహిణి ఒక చిన్న వెదురు బుట్టలో అరిటాకు వేసి, అందులో అన్నం పప్పూ కూరలూ సర్దింది. ఓ చిన్న పిడతలో పెరుగు, ప్రక్కనే పండూ తాంబూలం ఉంచింది. భక్తిగా అతిథికి సమర్పించింది. అర్జునస్వామి వారిని అన్నదాతా! సుఖీభవ! అంటూ ఆశీర్వదించి, తిన్నగా చెరువు గట్టుకు వెళ్ళాడు. చెరువులో నీళ్ళు నిర్మలంగా ఉన్నాయి. చెరువు ఒడ్డున పెద్ద మర్రి చెట్టుంది. దాని నీడ చల్లగా హాయిగా ఉంది. అర్జునస్వామి, భోజనం ఉన్న బుట్టని ఆ చెట్టు క్రింద ఉంచి, చెరువులో స్నానం, సంధ్యా వందనం పూర్తి చేసుకున్నాడు. చెట్టు క్రింద కూర్చొని ఆవురావురుమంటూ అన్నం తినసాగాడు. ఆ సమయంలో మర్రి చెట్టు కొమ్మపైకి ఓ గ్రద్ద వచ్చి వాలింది. దాని గోళ్ళల్లో ఓ కాలనాగు గిలగిల్లాడుతుంది. చెట్టు కొమ్మపైన కూర్చున్న గ్రద్ద, ఆ పాముని ముక్కుతో పొడుచుకొని తినసాగింది. మరణ యాతనకి పాము విలవిల్లాడుతూ విషం కక్కసాగింది. ఆ విషం తిన్నగా అర్జునస్వామి అన్నం తింటున్నా అరిటాకుపై సన్నని తుంపరగా పడసాగింది. ఎంత సన్నని బిందువులంటేఆరగిస్తున్న అర్జునస్వామికి సైతం దృష్టికి ఆననంత! అసలే ఆకలిగా ఉన్న అర్జునస్వామి, అన్నం పప్పూ కూరలతో స్వాదిష్టంగా ఉన్న భోజనాన్ని ఇష్టంగా ఆరగిస్తున్నాడు. అయితే కాస్సేపటికి, విషాహారం కారణంగా అతడు మృతి చెందాడు. ఇదీ కథ! అంటూ కథ ముగించిన భేతాళుడువిక్రమార్క మహీపాలా! ఈ బ్రహ్మహత్యా పాతకం ఎవరికి చెందుతుంది? ఆహారాన్నిచ్చిన బ్రాహ్మణ దంపతులకా? పాముని చంపితిన్న గ్రద్దకా? విషం గక్కిన పాముకా? విషాహారాన్ని తిని మరణించిన అర్జునస్వామికా? అనడిగాడు. త్వరపడి ఈ ప్రశ్నకు జవాబు చెప్పకండి. విక్రమాదిత్యుడి తర్కం చదివాక, అప్పుడు చెప్పండి. భారతీయుల నమ్మకాల్లోబ్రాహ్మణ హత్య (అంటే సత్వగుణ సంపన్నుడి హత్య) మహా పాపమనీ! దాన్ని బ్రహ్మహత్యాపాతకం అంటారు. అలాగే గోహత్య, స్త్రీ హత్య, శిశుహత్యలను కూడా పరమ పాపాలని నమ్మేవాళ్ళు. ఆ కోవలోకే చెందుతుంది ఆత్మహత్య కూడా! ఇప్పుడు నమ్మకాలూ బాగానే సడలి పోయాయి, దృక్పథాలూ మారిపో యాయి. ఎంత పాపానికైనా వెనుతీయని సమాజాన్ని ఇప్పుడు మనం చూస్తున్నాం. విక్రమాదిత్యుడు స్ఫుటంగా భేతాళా! ఇందులో ఎవరి తప్పూ లేదు. ఆకలిగొన్న అతిథిని సత్కరించటం గృహస్థు ధర్మంగా భావించి, బ్రాహ్మణ దంపతులు, అర్జునస్వామికి ఆహారం సమర్పించాడు. స్నాన సంధ్యలు ముగించి భోజనం చెయ్యడం సదాచారమని భావించి, అర్జునస్వామి చెరువుకు చేరాడు. చెట్టు నీడన కూర్చొని భోజనం చేసాడు. గ్రద్ద తన ఆహారాన్ని తాను వేటాడి తెచ్చుకుంది. చెట్టు కొమ్మపై కూర్చొంది. మరణ యాతనకి పాము విషం గ్రక్కింది. పాములు గ్రద్దలకి దేవుడిచ్చిన ఆహారం. మరణ సమయాన విషం గ్రక్కడం పాము ప్రారబ్ధం. అందుచేత వాటి దోషమూ లేదు. అందుచేత వీరెవ్వరికీ బ్రహ్మహత్యా దోషం అంటదు. అయితే ఎవరీ కథ విని, పూర్వాపరాలూ, ధర్మసూక్ష్మాలూ ఆలోచించకుండా ఫలానా వారికి బ్రహ్మహత్యా దోషం అంటుతుంది అంటారో, వారికి, ఈ బ్రహ్మహత్యా పాపం చుట్టుకుంటుంది అన్నాడు. విక్రమార్కుడి విజ్ఞతకి భేతాళుడికి చెప్పలేనంత ఆనందం కలిగింది. చప్పట్లు చరుస్తూ తన ఆనందాన్నీ, అభినందననీ తెలిపాడు. అయితే మౌనభంగమైనందున మరుక్షణం మాయమై మోదుగ చెట్టు పైన మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు.

– చారూశ్రీ

## డేట్ ఆఫ్ బర్త్ సర్టిఫికెట్ లేకపోయినా పాసుపోర్టు

పాసుపోర్టు పొందాలంటే చాలా నిబంధనలతో కూడుకున్న పని. దేశంలో చాలా తక్కువ మందికే పాసుపోర్టు ఉంటుంది. ఇప్పటి వరకు పాసుపోర్టు కోసం అప్లై చేయాలంటే తప్పనిసరిగా డేట్ ఆఫ్ బర్త్ సర్టిఫికెట్ తప్పనిసరి ఉండాలి. కానీ, పాస్ పోర్టు నిబంధనలను మరింత సరళతరం చేసింది కేంద్రం. దేశంలోని ప్రజలు సులభంగా పాస్ పోర్టు పొందేందుకు వీలు కల్పించింది. ఇప్పటి వరకూ పుట్టిన తేదీకి సంబంధించిన నిర్ణయం అమల్లో ఉండేది. జనవరి 26, 1989 తర్వాత పుట్టినవారెవరైనా సరే పాస్ పోర్టుకు దరఖాస్తు చేస్తే తప్పనిసరిగా పంచాయతీ, మున్సిపాలిటి, కార్పొరేషన్ జారీచేసిన సర్టిఫికెట్ సమర్పించాల్సి ఉండేది. పదో తరగతి సర్టిఫికెట్ ఇస్తే చెల్లదు. ఇదే అదనుగా దళారులు ఫోర్జరీ సర్టిఫికెట్లు తయారు చేసి ఇస్తున్నారు. వీటికి చెక్ పెట్టేందుకు కేంద్రం ప్రస్తుతం ఆ నిబంధనను పూర్తిగా తొలగించింది. ఇకపై ఆధార్ కార్డ్, ఓటరు కార్డ్, డ్రైవింగ్ లైసెన్స్, ఎల్ఐసీ పాలసీ బాండ్, టెన్త్ సర్టిఫికెట్ ఏదైనా పుట్టినతేదీ ఉన్న సర్టిఫికెట్ ఇస్తే చాలు. ఈ కొత్త నిబంధనలు జూలై 26వ తేదీ నుంచి అమల్లోకి వచ్చాయి. పెళ్లి చేసుకున్న వాళ్లు దరఖాస్తు చేసుకుంటే మ్యారేజ్ సర్టిఫికెట్, జీవిత భాగస్వామి పేరు రాయాల్సి ఉండేది. ఇక పై వీటిని సమర్పించాల్సిన అవసరం లేదు. తల్లి, తండ్రి దగ్గర పెరుగుతున్న పిల్లలు దరఖాస్తు చేసుకుంటే పేరెంట్ అనే కాలమ్ లో ఎవరి పేరు రాసినా సరిపోతుంది. తప్పని సరిగా తండ్రి పేరు రాయాలనే నిబంధన లేదు. అనాథ ఆశ్రయంలో పెరిగిన పిల్లలు అయితే ఆ ఆశ్రయం నిర్వాహకులు పుట్టిన తేదీని చెబితే సరిపోతుంది. గతంలో ఏదైనా సమాచారం ఇవ్వాల్సి వస్తే డ్యాక్యుమెంట్ పేపర్ పై నోటరీ చేయించి ఇవ్వాల్సి వచ్చేది. ఇకపై ఆ అవసరం లేదు. కేవలం తెల్ల కాగితంపై రాసి, సెల్ఫ్ డిక్లరేషన్ ఇస్తే చాలు. హిందూ సాధువులు, సన్యాసులు తమ తల్లిదండ్రుల స్థానంలో వారి ఆధ్యాత్మిక గురువు పేరును తెలిపితే చాలు. ప్రధాన పోస్టాఫీసుల్లో కూడా పాస్ పోర్టు సేవలు అందుబాటులోకి తెచ్చేందుకు కేంద్రం చర్యలు చేపట్టింది. సో..ఇక మీదట పాస్ పోర్ట్ పొందాలంటే బర్త్ సర్టిఫికెట్ పేరుతో పడి నానా ఇబ్బందులు ఉండవన్నమాట.






ఈ ప్రపంచం కఠినాతి కఠినమైంది. ఈ వాస్తవాన్ని ఎదుర్కోవడంలోనే సంతోష రహస్యం ఇమిడి వుంది. -బెర్ట్రండ్ రస్సెల్

# సూర్య బుడత



## • పద్యాలు తెలుసుకుందామా

నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు
తళుకుబెళుకు రాళ్ళు తట్టెడేల?
చాటు పద్యములను చాలదా ఒక్కటి
విశ్వదాభిరామ వినుర వేమ

**తాత్పర్యం:** నిజమైన మంచి నీలము ఒక్కటున్నాదానికి విలువ వుంటుంది కాని బుట్టనిండుగా తళుకు రాళ్ళకు విలువ వుండదు. అలాగే మంచి పద్యం ఒక్కటీ చాలును కదా.



# అమాయకత్వం

భద్రపురం గ్రామంలో ఆనందాచారి అనే గురువు, భాస్కరం అనే శిష్యుడు ఉండేవారు. భాస్కరం చాలా అమాయకుడు. ఏ పని చెప్పినా సులువుగా అర్థం చేసుకోలేకపోయేవాడు. అయినా గురువుగారు శిష్యుడు అనాథ కావడంతో తన వద్దనే అట్టిపెట్టుకున్నాడు.

ఆనందాచారి కొత్త ఇల్లు కట్టుకుని గృహప్రవేశం చేశాడు. తర్వాత ఒక బండి తెచ్చి, బండిలో సామాన్లు పెట్టి శిష్యుడిని పిలిచి 'నాయనా! బండిలో సామాను తీసుకుని మనం కొత్త ఇంటికి వెళదాం! నేను బండి ముందు వెళుతుంటాను. నువ్వు బండి వెనుక నడుస్తూ కింద పడిపోయినవి తీసి బండిలో వేస్తూ ఉండు' అని చెప్పాడు 'అలాగే గురువుగారూ!' అన్నాడు భాస్కరం.

బండి బయల్దేరింది. ఆనందాచారి బండి ముందు వెళుతున్నాడు. భాస్కరం బండి వెనుక నడుస్తున్నాడు. బండి కొత్త ఇంటికి చేరుకుంది. సామాను దింపుదామని ఆనందాచారి వెనక్కు వచ్చి చూస్తే బండిలో సామాను నిండా పేడ ముద్దలు వేసి వున్నాయి. శిష్యుడిని పిలిచి 'ఇదేమిట్రా భాస్కరం! బండిలో సామాను మీద పేడ వేశావు?' అని అడగ్గా భాస్కరం అమాయకంగా 'గురువుగారూ! మీరే కదా కింద పడిపోయినవి తీసి బండ్లో వేయమన్నారు. దారి పొడవునా బండికి కట్టినెద్దు పేడ కింద పడిపోతున్నదండీ, అందుకే తీసి బండిలో వేశానండీ' అని బదులిచ్చాడు.

శిష్యుడి అమాయకత్వానికి జాలిపడాలో, సామాను పాడైపోయినందుకు బాధపడాలో ఆనందాచారికి అర్థం కాలేదు. పాడైపోయిన సామాను పాడైపోయినందుకు బాధపడాలో ఆనందాచారికి అర్థం కాలేదు. పాడైపోయిన సామాను అంతా కడిగి శుభ్రం చేసే ప్రయత్నంలో పడ్డాడు ఆనందాచారి.

కథలోని నీతి: పెద్దలు చెప్పిన విషయంలో అర్థానిన చక్కగా గ్రహించి పనిచేయాలే తప్ప తెలివి తక్కువ పనులు చేయరాదు.

పిల్లలూ ఈ తల్లీ పిల్లల్ని కలపండి చూద్దాం... ఇక్కడున్న బొమ్మలను జతచేయండి



## దారిని చూపండి







ఈ జంతువులన్నీ బయటకు వెళ్ళి జూకి వెళ్ళే దానికి మర్చిపోయాయంట ఈ జంతువులకి జూలోకి ఎలా వెళ్ళాలో దారిని చూపించండి

## తేడాలు గుర్తించండి

పిల్లకాయలు ఈ బొమ్మలో తేడాలని గుర్తిద్దామా!





## రంగులు వేయండి

పిల్లలూ ఈ గుర్రానికి దాని పిల్లకు మంచి రంగును చూసి వేయండి



## చుక్కలు కలపండి

బుడ్డి బుడ్డి పిల్లలూ మీకు ఎ,బి,సి,డిలు తెలుసా అయితే కలపండి చూద్దాం






జీవితం బరువు బాధ్యతలను ఆనందంతో వహించడం నేర్చుకోవాలి. -శ్రీమద్భాగవతం



ఏ శాస్త్రాన్నైనా గురువు వద్ద నుంచే నేర్చుకుంటేనే రాణింపు ఎక్కువగా ఉంటుంది. కామశాస్త్రమైనా దీనికి మినహాయింపు కాదు. కామశాస్త్రాన్ని కూడా గురువు వద్ద నుంచీ నేర్చుకోవాలని వాత్స్యాయనుడు చెప్పాడు. స్త్రీలు ఏ వయసులో ఈ శాస్త్రాన్ని నేర్చుకోవాలి? ఎటువంటి గురువునుంచీ కామశాస్త్రాన్ని నేర్చుకోవాలి? అన్న విష యాలు తెలుసుకుందాం. ఈనాటి కాలంలో కామశాస్త్రాన్ని అభ్యసించడాన్ని ఎవరూ హర్షించరు. నేర్చుకునేందుకు

# కామశాస్త్రం గురించి ఏ వయసులో తెలుసుకోవాలి?

సృష్టిలోని జీవజాలం శృంగార శాస్త్రాన్ని గురించి క్షుణ్ణంగా తెలుసుకునో, అభ్యసించో అవి సంగమించడం లేదు కదా! మరి మానవుడు మాత్రం కామ శాస్త్రం గురించి తెలుసుకోవలసిన అవసరం ఏమొచ్చింది? శాస్త్రం అభ్యసించనిదే సంభోగక్రియకు అనర్హులవుతారా? అంటే అటువంటిదేమీ ఉండదు. కాకపోతే దేనినైనా శాస్త్రంగా అభ్యసిస్తే మరింత ఉపయోగం ఉంటుంది. చివరికి ఇక్కడైనా అంతే. కామశాస్త్రాన్ని అభ్యసించిన వారు మిగిలిన వారికంటే ఎక్కువ సౌఖ్యాన్నిపొందగలరని వాత్స్యాయనుడు అంటాడు.

కూడా ముందుకురారు. కానీ పూర్వకాలంలో పరిస్థితి ఇలా ఉండేది కాదు. స్త్రీలు, పురుషులు కూడా కామశాస్త్రాన్ని అభ్యసించేవారు. స్త్రీలలో ఎక్కువమంది వేశ్యలే కామ శాస్త్రాన్ని ఆ కాలంలో అభ్యసించేవారు. అందుకే వేశ్యలు విటుల్ని ఆకర్షించడానికి మెళుకువలను కూడా వివరించాడు. నిజానికి ఈ కాలంలోనే కాదు, ఆ కాలంలో కూడా యువతులకు కామ సూత్రాలునేర్పేందుకు ప్రత్యేకంగా గురువులుండే వారు కాదు. అందుకే వివాహం కావలసిన యువతి, కామసూత్రాలను తెలుసుకొనగోరు యువతి వివాహానికి పూర్వం తనవుట్టింట్లోనే నేర్చుకోవాలని వాత్స్యాయనుడు సూచించాడు. అంటే నేటి పరిస్థితులలో ఇంచుమించు 16-18 సంవత్సరాల వయసులో ఈ విద్యను అభ్యసించాలన్న మాట. కామసూత్రాలను నేర్చుకునే యువతులకు సన్నిహితంగా ఉండే సమ వయస్కులైన యువతులు ఆయా సూత్రాలు నేర్పాలంటాడు వాత్స్యాయనుడు. పెళ్లయిన యువతులు భర్త అంగీకారంతో

కామశాస్త్రాన్ని అభ్యసించాలి. ప్రాచీన కాలంలో యువ తులు 64 కళలలో ప్రవేశం కలిగి ఉంటే మంచిదనే అభి ప్రాయం ఉంది. దీనితో వాత్స్యాయనుడు కూడా ఏకీభవిస్తాడు. వివాహానికి పూర్వం యువతి లలిత కళల్లో ప్రవేశం పొంది ఉండాలి. ఇక యువకుడైతే బ్రహ్మచర్యం అవలంబిస్తూ ధనార్జన పరుడైన తర్వాత కామసూత్రాలను అభ్యసించడం మేలు. వాత్స్యాయనుడు చెప్పిన సూత్రాలు ఆనాటి కాలాన్ని అనుసరించి చెప్పినవన్న సంగతి మర్చిపోరాదు. శృంగారాన్ని ప్రేరేపించడంలో పడక గది అలంకరించిన తీరు, పడక గదిలోని వాతావరణం కీలక పాత్ర వహిస్తాయని వాత్స్యాయనుడు చెబుతాడు. నేటి మానసిక శాస్త్రవేత్తలూ ఇదే విషయాన్ని సమర్ధించడం గమనించదగిన విషయం. పడక గది లంకరించుకోవలసిన తీరు వాత్స్యాయనుడు ఏం చెప్పాడు, దాని వెనుక ఉన్న శాస్త్రీయ దృక్పథం

గురించి ఇప్పుడు చూద్దాం. పడక గదిలో మేలైన, నగిషీలున్న మంచం ఉండాలి. దాని మీద మెత్తని తలగడలు, పరువులు ఉంచాలి. తలగడలను తల వైపు, పాదాల వైపు కూడా అమర్చుకోవాలి. పరువుపై శుభ్రమైన తెల్లని వస్త్రాన్ని వేయాలి. ప్రతి రెండుమూడు రోజులకొక సారి ఈ వస్త్రాన్ని మార్చుతుండాలిఅని వాత్స్యాయనుడు చెబుతున్నాడు. పరిశుభ్రతకు ప్రాధాన్యమివ్వాలని. పడకను సౌకర్యంగా అమర్చు



కోవడం అవసరమని ఇక్కడ వాత్స్యాయనుడు పరోక్షంగా వివరిస్తున్నాడు. గదిలోకి అడుగిడిన వెంటనే అత్తరు, సుగంధద్రవ్యాల పరిమళాలు మత్తెక్కించాలి. లవంగాలు, యాలకుల వంటివి పడకగదిలో అందుబాటులో ఉంచుకోవాలి అని అంటారు వాత్సాయన ముని. ఇక శృంగారానికి వచ్చే సరికి సువాసనలు, సుగంధ ద్రవ్యాల ప్రాముఖ్యాన్ని ప్రత్యేకించి చెప్పవలసిన అవసరం ఏమున్నది? మొత్తానికి 16-18 సంవత్సరాల వయసులో స్త్రీ పురుషులు కామశాస్త్రం గురించి తెలుసుకోవడం ఉత్తమం. అందులో భాగంగానే పడక కది శృంగారంలో మెలకువలు తెలుసు కోవడం వల్ల దాంపత్య జీవి తం సుఖమయం అవుతుంది.

## క్రైం స్టోరీ

# శవంతో రెండు రోజులు..!

వ్యసనాలు పచ్చని సంసారంలో చిచ్చు రేపిన ఘటనలు కోకొల్లలు. మద్యానికి బానిసై భార్యా పిల్లలను తాకట్టు పెట్టిన మగాళ్లు, తాగొచ్చి భార్య పిల్లలు ఉసురు తీసిని ప్రభుద్దుల కథలు వార్తాపత్రికల్లో తరచూ చూస్తుంటాం. అంతెందుకు ప్రియుని మాయలో పడి భర్తనే కడతేర్చిన భార్యల కథనాలు చదివాం. చివరకు మనీ మాయలో పడి కన్న కూతురునే మాజీ భర్త, కారు డ్రైవర్‌తో కలిసి హత్యచేసి, పెట్రోల్‌పోసీ తగల పెట్టిన తల్లి గురించి తెలుసు. వీటన్నిటికి కారణం ఏదో ఒక వ్యసనం. వ్యసనాలు ఎంతటి దుష్పరిణామాలుకు దారితీస్తాయో తెలుసు. అయినా వాటికి బానిసగామారి జీవితాలను నాశనం చేసుకుంటూనే ఉన్నారు సమాజంలో చాలా మంది. మద్యానికి బానిసై, చివరకు భార్య చేతిలో భర్త కడతేరిన సంఘటన దేశ రాజధాని ఢిల్లీలో కలకలం రేపింది. భర్త ఆగడాలు భరించలేక, అతను దేనికైతే భానిసయ్యాడో అదే వ్యసనాన్ని ఆసరాగా చేసుకుని అతన్ని అంతం చేసి, శవాన్ని ఏమిచేయాలో తెలియక ఇంటిలోనే రెండు రోజులు ఉంచుకున్న సంఘట ఢిల్లీలో చోటు చేసుకుంది. ఇంతకు ఆభార్య భర్తనే ఎందుకు అంతం చేయాల్సి వచ్చింది. అందుకు దారితీసిన పరిస్థితులు ఏంటో తెలుసుకుందాం..

పైసా సంపాదించకపోగా, తన సంపాదనతో తాగి తననే కొడుతున్న భర్త దుశ్చర్యలను భరించలేక ఓ భార్య అతన్ని హతమార్చిన వైనమిది. అయితే శవాన్ని ఏం చేయాలో తెలియక గదిలో దాచిపెట్టి రెండురోజులు గడిపింది. ఈ ఘటన న్యూఢిల్లీలోని కాపస్ హేడాలో వెలుగు చూసింది. కానీ అంతిమ సంస్కారాల సమయంలో ఓ వ్యక్తికి అనుమానమొచ్చి పోలీసులకు ఫోన్ చేయడంతో అసలు విషయం బయటపడింది. చట్టం చేతులు పొడుగంటారు కదా చివరకు పోలీసుల ఎదుట ఆమె తన నేరాన్ని అంగీకరించింది. వివరాల్లోకి వెళేతే... పశ్చిమ బెంగాల్ రాష్ట్రం మిడ్నాపూర్‌కు చెందిన శిల్పి అధికారి రాయల్ బ్యాంక్ ఆఫ్ స్కాట్లాండ్‌లో ఉద్యోగ పని చేసేది. ఆమెకు భర్త నితీశ్, ఇద్దరు పిల్లలు ఉన్నారు. అయితే తన భర్త తన సంపాదనతోనే నిత్యం తాగి వచ్చి కొడుతూ పిల్లలను చదువుకోనివ్వకపోవడంతో వారిని స్వగ్రామంలోనే ఉంచి చదివించేది. శిల్పి భర్త రోజు తాగి వచ్చి చితకబాదేవాడు. కొట్టిన అనంతరం అలసిపోయి పడుకునేవాడు. చివరకు అతని ఆగడాలు భరిచలేక చంపేస్తానని బెదిరించినా అతనిలో రవ్వంత మార్పు లేక పోగా, మరీ పెచ్చుపెరిగి పోయాయి. దీంతో ఏ భార్య తీసుకోని విధంగా, తన భర్తనే చంపేయాలని నిర్ణయం తీసుకుంది. దానికి ఆతని వ్యసనాన్నే ఆసరాగా తీసుకుంది. ముందస్తుగా ఓ పథకం సిద్ధం చేసుకుంది. ఓ రోజు రాత్ర తన భర్త ఇంటికి రాగానే అతనితో మంచిగా ఉంటూ, అతనికి ఇష్టమైన మద్యం తీసుకు వచ్చి అతనితో బాగా తాగించింది. భార్యేతనకు మద్యం తాగించడంతో ఆనందంతో ఒళ్లు తెలియకుండా తాగిన భర్త, పూటూగా తాగి మతులోకి జారుకున్నాడు. భర్త మత్తులో నిద్రపోయిన తర్వాత, తాను ముందుగా వేసుకున్న ప్రణాళిక ప్రకారం అతని గొంతు నులిమి చంపేసింది. భర్త చనిపోయిన తర్వాత ఆ శవాన్ని ఏం చేయాలో తెలియక, రెండు రోజులు బయటకు రాకుండా గదిలో భర్త శవంతో గడిపింది. అలా రెండు రోజులు భర్త శవంతో జాగారం చేసిన భార్య, రెండో రోజు ఉదయం ఇంటి ముందు కూర్చుని భర్త గుండెపోటుతో చనిపోయాడంటూ శిల్పి ఏడ్వడం ప్రారంభించింది. ఇరుగు పొరుగు వారికి కూడా ఆమెపై అనుమానం రాలేదు.కారణం అతని వ్యసనం గురించి,అతను శిల్పిని పెడుతున్న బాధల గురించి తెలుసు కాబట్టి. దీంతో సానుభూతితో వారు ఆమె భర్త అంత్య క్రియలకు తలో చేయివేశారు. తాగుబోతు మొగడు ఉన్నలేకున్నా ఒక్కటే అనే విధంగా ఆమెను ఓదార్చారు. దాంతో తన పథకం ఫలించినందుకు, ఇక మీదట తనకు తాగుబోతు మొగుడి బాధలు ఉండవని తలుచుకుంది. ఇక మీదట తన పిల్లలతో ఉండొచ్చని లోలోన ఆనంద పడింది.కాని నిజం దాగదుకదా. ఆఖరి క్షణంలో ఒక్క ఫోన్ కాల్‌తో ఆమె బండారం బయట పడింది. శిల్పి బాధలు చూసిన ఇరుగు పొరుగు.. శవాన్ని

కాశ్మశానవాటికకు తీసుకెళ్లి అంత్యక్రియలకు ఏర్పాట్లు చేశారు. ఇంక కొద్ది క్షణాల్లో శవానికి నిప్పు పెడితే కాలి బూడిద్యయేది. శిల్పి ప్లాన్ వంద శాతం వర్కౌట్ అయ్యేది. కాని ఓ వ్యక్తికి వచ్చిన చిన్న అనుమానంతో కథ అడ్డం తిరిగింది.

శిల్పి భర్తను చంపిన తర్వాత శవాన్ని ఎలా మాయం చేయాలో తెలియక రెండు రోజులు ఇంటిలోనే ఉంచుకోవడంతో శవం నుంచి వాసన రావడం మొదలైంది. ఇరుగు పొరుగు ఆమె కష్టాలు చూశారు. అందుకే వారు శవం వాసనను గురించి పెద్దగా పెట్టించుకోలేదు. కాని ఓ వ్యక్తికి మాత్రం అనుమానం వచ్చింది. శవం నుంచి దుర్వాసన రావడం, గొంతుపై కమిలిన గుర్తులు ఉండటం చూసి అతను చాటుగా వెళ్లి పోలీసులకు ఫోన్ చేశాడు. శవాన్ని చితిపై ఉంచి అంటించబోతుండగా పోలీసులు రంగప్రవేశం చేశారు. శవాన్ని స్వాధీనం చేసుకుని పరిశీలిస్తే, ఫోన్ చేసిన వ్యక్తికి వచ్చిన అనుమానం పోలీసులకు వచ్చింది. వెంటనే శవాన్ని పోస్ట్‌మార్టంకు పంపారు. గొంతు నులిమి రెండు రోజుల కింద చంపినట్లు పోస్ట్‌మార్టంలో తేలింది.పోలీసులు శిల్పను అదువులోకి తీసుకుని ప్రశ్నించారు. శిల్పి కూడా పోలీసుల ఎదుట తన నేరాన్ని అంగీకరించింది. పోలీసులు జరిపించిన వైద్య పరీక్షలలో భర్త ఆమెను కొట్టిన విషయం కూడా రుజువైంది.



## జాతకం

# పూజగదిలో శివలింగం ఉంటే

**నవగ్రహాల్లో బుధుడికి ప్రీతికరమైన మరక తాన్ని ధరించడం ద్వారా శుభఫలితాలు వుం టాయి. అలాగే మరకతంతో తయారైన శివ లింగాన్ని పూజించడం ద్వారా అనుకున్న కార్యాలు దిగ్విజయంగా పూర్తవుతాయి. కోరిన వరాలు నెరవేరుతాయి. నవరత్నాల్లో ఒకటైన మరకతానికి ఆకర్షణ శక్తి ఎక్కువ. అలాంటి మరకతాన్ని లింగ రూపంలో పూజించడం ద్వారా అన్నీ రంగాల్లో రాణిస్తారు.**

విద్య, ఆరోగ్యం, ఉన్నత పదవులు లభించా లంటే.. మరకత లింగాన్ని పూజించడం ద్వారా ప్రాప్తిస్తాయి. అలాగే వ్యాపారంలో అభివృాఎద్ధి సాధించాలంటే.. మరకత లింగాన్ని పూజిం చాలి. అంతేగాకుండా మరకత లింగాన్ని పూజిస్తే సమస్త దోషాలు తొలగిపోతాయని ఆధ్యాత్మిక పండితులు సూచిస్తున్నారు. ఈ లింగాన్ని నిష్ఠతో ప్రార్థించే వారికి ఒత్తిడి మాయమవుతుంది. అలాగే ఇంటనున్న ప్రతికూల శక్తులను తొలగిపోతుంది. అలాగే అనుకూలత చేకూరుతుంది.

ఈ మరకత లింగమో లేకుంటే వేరేదైనా శివలింగం ఇంట్లో వుండినట్లైతే... నియమం ప్రకారం పూజించాలి. శివలింగానికి ముందుగా వీరు, పాలు, తేనె, పెరుగు, పంచామృాఎతాలతో అభిషేకించాలి. ఆపై బిల్వ పత్రాలు, చందనం,



విభూతితో అభిషేకించి.. దీపారాధన చేయాలి. పూజ గదిలో శివలింగం వుంటే స్నానం చేశాకే ఎవరైనా పూజగదిలోకి ప్రవేశించాలి.

మహా మృాత్యుంజయ మంత్రాన్ని జపించాలి. పండ్లు, వువ్వులతో రోజూ అర్చించాలి. శక్తి మేరకు ధూపదీప నైవే ద్యాలు సమర్పించాలి. ప్రదోషకాలంలో తప్పక శివలింగానికి అభిషేకం చేయాలి. ఇలా శివలిం గాన్ని ఇంట వుంచి పూజ చేయడం ద్వారా శని గ్రహ దోషాలు తొలగిపో తాయి. ఆరోగ్య సమ స్యలు వుండవు. వృా ఎత్తిపరమైన అభివృాఎద్ధి వుంటుంది. ఇంట పం డగ వాతావరణం నెల కొంటుంది. శుభ కార్యాలు జరుగుతాయి. మోక్షం సిద్ధిస్తుంది.

మీ సందేహాలని క్లుప్తంగా (మనిషికి 1 ప్రశ్న మాత్రమే) ఈ క్రింది వివరాలు వ్రాసి పంపండి. (పుట్టిన తేదీ వివరాలు లేనివారు 108 లోగా ఒక సంఖ్య వ్రాసి పంపండి. ఇది ప్రశ్న పద్ధతి, మనిషికి ఒక్క ప్రశ్న మాత్రమే)

పేరు : ....................................

పుట్టిన తేదీ : ....................................

పుట్టిన సమయం : ..............................

పుట్టిన ఊరు (మండలం) : ..................

ప్రశ్న : ....................................

పై వివరాలతో కూడిన లెటర్‌ను ఈ క్రింది అడ్రస్‌కు పంపండి...

**'జాతకం' 'సూర్య' ఆదివారం**

**SPR publications, Surya Soudha, Plot.No: 185, M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar, AyyappaSociety Opp: Hi-Tech City, Hyderabad - 500 072.**

## 6-8-2017 నుండి 12-8-2017 రాశిఫలం



**మేషం: Aries**( అశ్విని, భరణి, కృత్తిక - 1) : ఉద్యోగస్తులకు ప్రయాణాలలో ఎక్కువ చికాకులు ఇబ్బందులను ఎదుర్కొంటారు. ఇచ్చివుచ్చుకునే వ్యవహారాలు, ఒప్పందాల్లో మెలకువ వహించండి. సతీసమేతంగా ఒక వుణ్యక్షేత్రాన్ని సందర్శిస్తారు. చిన్నారుల విషయంలో పెద్దలుగా మీ బాధ్యతలను నిర్వర్తిస్తారు. పెరిగిన ధరలు, చాలీచాలని ఆదాయంతో సతమతమవుతారు.



**వృషభం: Taurus** (కృత్తిక - 2,3,4, రోహిణి, మృగశిర - 1,2): సామాజిక కార్యక్రమాల పట్ల ఆసక్తి పెరుగుతుంది. మీ అభిప్రాయలను ఇతరులపై బలవంతంగా రుద్దడం మంచిది కాదని గమనించండి. విద్యార్థుల మొండి వైఖరి ఉపాధ్యాయులకు చికాకు కలిగిస్తుంది. కానివేళలో ఇతరుల రాక ఇబ్బంది కలిగిస్తుంది. ఖర్చులు అదువు కాకపోగా మరింత ధనవ్యయం అవుతుంది.



**మిధునం: Gemini** (మృగశిర -3,4బ్యాంకు వ్యవహారాలలో పరిచయం లేని వ్యక్తులతో మితంగా సంభాషించండి. సాహస ప్రయత్నాలు విరమించండి. పెద్దల సలహాను పాటించి మీ గౌరవాన్ని నిలబెట్టుకుంటారు. ఉద్యోగస్తులకు పై అధికారుల నుంచి ఒత్తిడి, చికాకులు అధికమవుతాయి. వాహన చోదకులకు చికాకులు అధికమవుతాయి.



**కర్కాటకం: Cancer**(పునర్వసు -4, శ్రీవారు, శ్రీమతి విషయంలో మనస్పర్థలు ఏర్పడే అవకాశం ఉంది. నిరుద్యోగులకు ఇంటర్వ్యూలలో విజయం లభిస్తుంది. ఉద్యోగ వ్యాపారాలలో ఆటుపోట్లు ఎదుర్కొంటారు. ఆకస్మికంగా దూర ప్రయాణాలు చేస్తారు. రుణాల కోసం అన్వేషిస్తారు. విద్యార్థులు రాత, మౌఖిక పరీక్షల్లో విజయం సాధిస్తారు.



**సింహం: Leo** (ముఖ, పుబ్బ, ఉత్తర -1) ఆర్థిక లావాదేవీల్లో ఒడిదుడుకులు ఎదురైనా అధిగమిస్తారు. స్త్రీలకు ఉపాధి పథకాల పట్ల ఆసక్తి పెరుగుతుంది. ఉద్యోగస్తులు ఒత్తిళ్ళు, ప్రలోభాలకు పోకుండా ఏకాగ్రతతో పనిచేయవలసి ఉంటుంది. మిమ్మల్ని పొగిడేవారే కానీ సహకరించే వారుండరు. కోర్టు పనులు కొంత మందకొడిగా సాగుతాయి.



**కన్య: Virgo** ( ఉత్తర - 2,3,4, హస్త, చిత్త -1,2) తలపెట్టిన పనులలో విఘ్నాలు, చీటికి మాటికి అసహనం ఎదుర్కుంటారు. గృహం ఏర్పరుచు కోవాలనే కోరిక బలపడుతుంది. మిత్రులు కూడా మీకు దూరంగా ఉండటానికి యత్నిస్తారు. ప్రైవేటు సంస్థల్లో వారికి యాజమాన్యం నుంచి ఒత్తిడి, చికాకులను ఎదుర్కొంటారు. నిరుద్యోగులకు ఇంటర్వ్యూల్లో ఏకాగ్రత అవసరం.



**తుల: Libra** (చిత్త -3,4, స్వాతి, విశాఖ -1,2,3) ఓర్పు, నేర్పుతో వ్యవహరించటం ఎంతైనా అవసరం. రుణ విముక్తులు కావటంతో మానసిక ప్రశాంతత పొందుతారు. పత్రికా రంగంలోని వారికి గుర్తింపు రాణింపు లభిస్తుంది. కోర్టు వ్యవహారాలు వాయిదా పడుట మంచిది. మీ సంతానం భవిష్యత్తు గురించి కొత్త పథకాలు వేస్తారు. పెద్దల ఆరోగ్యం నిరుత్సాహపరుస్తుంది.



**వృశ్చికం: Scorpio** (విశాఖ -4 అనూరాధ, జ్యేష్ఠ) ఇతరులపై ఆధారపడక స్వశక్తితోనే మీ పనులు పూర్తి చేసుకోవటం శ్రేయస్కరం. ఆత్మీయులతో కలిసి విహార యాత్రలలో పాల్గొంటారు. ఒక కార్యం నిమిత్తం దూర్రపయాణం చేయవలసి వస్తుంది. సన్నిహితులతో కలిసి చేపట్టిన పనులు సమీక్షిస్తారు. దూర్రపయాణాలు బ్యాంకింగ్ వ్యవహారాలలో అప్రమత్తత ఎంతో అవసరం.



**ధనుస్సు: Sagittarius** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ -1) స్థిరాస్తి క్రయ విక్రయాలు సంతృాప్తికరంగా ఉంటాయి. వృత్తుల వారికి శ్రమకు తగిన ప్రతిఫలం లభిస్తుంది. స్త్రీలకు పనివారితో చికాకులు అధికమవుతాయి. అతిధి మర్యాధలు బాగుగా నిర్వహిస్తారు. కోర్టు వ్యవహారాల్లో ప్లీడర్లు, ప్లీడరు గుమస్తాలకు ఆటంకాలు తప్పవు. స్త్రీలకు టి.వి ఛానెళ్ల నుంచి ఆహ్వానం అందుతుంది.



**మకరం: Capricorn** (ఉత్తరాషాఢ -2,3,4, శ్రవణం, ధనిష్ఠ -1,2): ఆర్థిక వ్యవహారాల పట్ల శ్రద్ధ వహిస్తారు. ఒక్కసారి ప్రేమిస్తే ఆ ప్రేమను నిలబెట్టుకోవడానికి ఎంతైనా పోరాడతారు. మిమ్మల్ని అభిమానించే వ్యక్తుల మనస్సులను బాధపెట్టకండి. ఉద్యోగస్తులు ఒత్తిళ్ళు, ఆకర్షణలకు దూరంగా వుండటం అన్నివిధాలా క్షేమదాయకం. ఎల్.ఐ.సి, పోస్టల్ ఏజెంట్లకు ఒత్తిడి, ఆందోళన తప్పవు.



**కుంభం: Aquarius** (ధనిష్ఠ-3,4, శతభిష, పూర్వాభాద్ర- 1,2,3 ఇతరులకు పెద్దమొత్తంలో ధనసహాయం చేసే విషయంలో లౌక్యంగా వ్యవహరించండి. మీ ధైర్యసాహసాలకు మంచి గుర్తింపు లభిస్తుంది. విదేశీయానాలకై చేయు యత్నాలు అనుకూలిస్తాయి. స్త్రీల ఆరోగ్యంలో మార్పు ఆందోళన కలిగిస్తుంది. సజ్జన సాంగత్యం, ప్రముఖులతో పరిచయాలు మీ ఉన్నతిని పెంచుతాయి.



**మీనం: Pisces** (పూర్వాభాద్ర -4, ఉద్యోగస్తులు అపరిచిత వ్యక్తుల పట్ల అప్రమత్తంగా మెలగవలసి ఉంటుంది. రేషన్ డీలర్లకు కొత్త సమస్యలు తలెత్తుతాయి. బ్యాంకు పనులు మందగిస్తాయి. వృత్తి వ్యాపార సంబంధాలు విస్తరిస్తాయి. దూర ప్రయాణాలలో ఇబ్బందులను ఎదుర్కొంటారు. మీ సంతానం మొండివైఖరి మీకు ఎంతో ఆందోళన కలిగిస్తుంది.



నిద్రపోయి కలగన్నాను బ్రతుకంతా సుందరమని. మేలుకొని కనుగొన్నాను బ్రతుకు పెద్ద బాధ్యత అని. -గొథె

ఆలయం

# వేయి వసంతాల బృహదీశ్వర ఆలయం

విశాలమైన ఈ ఆలయానికి చేరడానికి మూడు ద్వారాలున్నాయి. మొదటి ద్వారం కేరళాంతకన్, రెండవ ద్వారం రాజరాజన్ తిరువనల్, మూడో ద్వా రం తిరువానుక్కన్ తిరువనల్. అక్కడో నంది మండపం వుంది, ఇది మన రాష్ట్రంలోని లేపాక్షి బసవన్న తరువాత అంత భారీ విగ్రహం. ఈ నంది మండ పాన్ని చోళ రాజుల తర్వాత పరిపాలించిన నాయక రాజులు, మరాఠాలు అంద మైన నగిషీలతో చిం[త్రిం]చిన చిత్రాలను అద్భుత రీతిలో మలిచారు. ఈ మహా నందికి ఎదురుగా ప్రధాన ఆలయం ఉంది. ఈ ఆలయం పై భాగం మహా ముఖ మండపాలతో నాలుగు అంతస్తులతో ఉంది. ఆలయ ప్రధాన ద్వారం తూర్పుకు ఉండగా పడమర, ఉత్తర, దక్షిణ దిశల్లో కూడా ద్వారాలున్నాయి. గర్భ గుడిలో చలా పెద్ద లింగ పీఠమూ, దాని మీద అతిపెద్ద లింగమూ ఉన్నాయి. ఇంత అందమైన, పెద్దదిగా ఉన్న లింగము దేశంలో ఇక్కడే చూస్తాము. రెండు గోడల మధ్య రెండు అంతస్తులలో ప్రదక్షిణ మార్గం ఉంది. నాలుగువైపుల ద్వారాలున్న ఈ ఆలయం చతుర్ముఖం లేక సర్వతోభద్రంగా ఉన్న ఆల యంగా వర్ణిస్తారు శిల్పులు.

ఆలయ బయటి ద్వారాల ప్రక్కల ఎత్తన ద్వారపాలకుల విగ్రహా లున్నాయి. బయటి గోడల నిలువు గూళ్ళపైనా, రెండవ స్తం భాల గోడలపైనా పెద్ద శాల ఉంది. మధ్య ఉన్న నిలువి గూళ్ళ పైన పంజరాలున్నాయి. ద్వారానికి అటు, ఇటు వైపున ఉన్న నిలువు గూళ్ళను దేవకోష్టాలుగా తీర్చి దిద్ది వాటితో అందంగా చెక్కిన దేవతామూర్తుల విగ్రహాలు ప్రతిష్టించారు. ఈ దేవతా మూర్తుల అవతార గాథలను శిల్పాలుగా సూక్ష్మ రూపంలో చెక్కి అక్కడ ఉంచడం ఈ దేవాలయం ప్రత్యేకత. క్రింద గర్భాలయం గోడలో దక్షిణాన కూర్చున్న శివుడు, పడమటివైపున నటరాజు, ఉత్తరాన దేవీమూ ర్తులు ఉన్నారు. అంతేకాక ప్రదక్షిణ మార్గం లోపలి గోడ మీద, కుడ్య స్తంభాల మీద వర్ణచిత్రాలను అద్భుతంగా చిత్రించారు. ఈ వర్ణ చిత్రాలలో శివుడు త్రిపురాసురుడిని సంహరించిన కథ, నటరాజుని పూజిస్తున్న రాజు, ఇంకా పక్షులు, అందమైన లతలు, నాట్య భంగిమలతో ఉన్న నాట్యకతెలు వంటి పలుచిత్రాలు మనల్ని అబ్బురపరుస్తాయి. ఈవిధంగా సర్వకళాశోభితమై, సంస్కృత, తమిళ శాసనాలున్న చారిత్రాత్మక ప్రసిద్ధ దేవాలయంగా అలరారుతోందీ బృహదీశ్వర ఆలయం.. ఈ ఆలయాన్ని మొదటి రాజరాజచోళుడు ప్రారంభించినా తరువాత వచ్చిన వివిధ పాలకులు, రాజులు అభివృద్ధిపరిచారు. ఈ ఆలయానికి ఏ దేవాలయా నికీ లేని ఒక ప్రత్యేకత ఉంది. కుల, మత, వర్గ భేదం లేకుండా అందరూ ఈ ఆలయాన్ని దర్శించవచ్చని ఇక్కడ ఒక ప్రకటన కూడా ఉంది. విదేశీయులు కూడా ఈ ఆలయాన్ని దర్శించవచ్చు.

ఆలయం నిర్మాణంలో అన్నీ వింతలే.

బృహదీశ్వరాలయం వేయి సంవత్సరాల నాటి గుడి. అంతే కాదు భారత నిలబడటమనేది ఇప్పటికీ అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తుతోంది. దేశంలోనే అతి పెద్ద శివలింగం ఉన్న గుడి. ఇక్కడ కనిపించే ప్రతి అంశం ఓ మిస్టరీతో పాటు ఆశ్చర్యానికి గురిచేస్తుంది. ఎక్కడా సిమెంట్ అన్నమాటకు తావు లేకుండా ఉక్కు అన్నపదం లేకుండా కట్టిన ఈ గుడిని చూస్తే ఆనాటి టెక్నాలజీ ఇంత అద్భుతంగా ఉందా అని పిస్తుంది. ఆశ్చర్యంతో పాటు ఆసక్తి రేపుతున్న ఆ గుడి గురిం చిన కొన్ని మిస్టరీ వింతలు. ఇది 13 అంతస్తులు కలిగిన ఏకైక పురా తన క్షేత్రం. భారతదేశంలో అతి పెద్ద శివలింగం ఉన్న క్షేత్రం. దాదావు ఈ శివలింగం 3.7 మీటర్ల ఎత్తు కలిగి ఉంటుంది. పెద్ద నంది విగ్రహాన్ని అక్కడ నిర్మించారు. ఈ విగ్రహం దాదావు 20 టన్నులు కలిగి ఉంటుంది. ఇంకా ఆశ్చర్యకరం ఏంటంటే ఇది ఏక శిలా విగ్రహం. 2 మీటర్ల ఎత్తు ,2.6 మీటర్ల పొడవు, 2.5 మీటర్ల వెడల్పు కలిగి ఉంటుంది. ఈ ఆలయానికి ఎటువంటి ఉక్కు గాని సిమెంట్ కాని వాడలేదు. పూర్తిగా గ్రానైట్ రాయితో కట్టబ డింది. 80 టన్నుల ఏకశిలతో చేసిన గోపుర కలశం ఈ గుడికే హైలెట్.

13 అంతస్థుల పైన ఎటువంటి వాలు లేకుండా ఇక మిట్ట మధ్యాహ్న సమయంలో ఆ గోపురం నీడ ఎక్కడా పడదు. గుడి నీడ కనపడినా గోపురం నీడ మాత్రం చూడలేము. ఈ ఆలయ ప్రాంగణం దాదావు పర్లాంగు దూరం ఉంటుంది. అంటే చాలా సువిశా లంగా ఉం టుంది. మనం మాట్లా డుకునే శబ్దాలు మళ్లీ ప్రతిధ్వనిం చవు. అంతటి శబ్ద పరిజ్ఞానంతో ఈ గుడిని కట్టారు. ఆలయం లోపల అనేక సొరంగ మార్గాలున్నాయి. ఇవి కొన్ని తంజా వూరులో ఉన్న కొన్ని ఆలయాలకు దారితీస్తే కొన్ని మాత్రం మరణానికి దారి తీసే గోతులు కలిగి ఉన్నాయని అన్ని దారులు మూసేశారు. అయితే ఇప్పటికీ టెక్నాలజీకి అంతుపట్టని విషయం ఏం టంటే. ఈ గుడికి చుట్టూ ఉన్న రాతి తోరణాలలో ఆరు మిల్లీమీటర్ల కన్నా తక్కువ సైజులో వంపుతో కూడిన రంధ్రలు కనిపించడం. అవి అలా ఎందుకు పెట్టారు ఇప్పటికీ మిస్టరీనే. వేయి సంవత్సరాల గుడులు దాదావు పాడుబడిన స్థితిలో ఉంటాయి.

ఆధ్యాత్మిక భారతం

# ధ్వజస్తంభం కథ

ఏ దేవాలయానికి వెళ్ళినా ముందుగా ధ్వజ స్తంభా నికి మొక్కి, ప్రదక్షి ణచేసి ఆత ర్వాతే లోపలికి వెళ తాం. ఈ ధ్వజస్తం భం ఏర్పడటానికి ఓ కథ ఉంది. భారత యుద్ధానంతరం పాండవులలో జ్యేష్ఠుడైన ధర్మరాజు సింహాసనాన్ని అధిష్టిస్తాడు. ధర్మబద్ధంగా రాజ్య పాలన చేస్తుంటాడు. ధర్మమూర్తిగా, గొప్పదాతగాపేరు పొందాలనే కోరికతో విరివిగా దానధర్మాలు చేయడం మొదలు పెడతాడు. ఇదంతా చూస్తున్న శ్రీకృష్ణుడు అతనికి తగినరీతిగా గుణపాఠం చెప్పాలనుకుంటాడు. ధర్మరాజుకి అశ్వమేధయాగం చేసి, శత్రురాజులను జయించి, దేవతలనూ బ్రాహ్మణులను సంతుష్టి పరచి, రాజ్యాన్ని సుస్థిరం, సుభిక్షం చేయమనీ చెప్తాడు. ధర్మరాజు శ్రీకృష్ణుని మాట శిరసా వహించి అశ్వమేధానికి సన్నాహాలు చేయించి, యాగాశ్వానికి రక్షకులుగా నకుల సహదేవులను సైన్యంతో పంపుతాడు.ఆ యాగాశ్వం అన్నిరాజ్యాలూ తిరిగి చివరికి మణిపుర రాజ్యం చేరుతుంది. ఆ రాజ్యానికి రాజు మయూర ధ్వజుడు. ఆయన మహ పరాక్రమ వంతుడు, గొప్ప దాతగా పేరుగాంచినవాడు. మయూరధ్వజుని కుమారుడు తామ్ర ధ్వజుడు, పాండవుల యాగాశ్వాన్నిబంధిస్తాడు. తామ్రధ్వజునితో యుద్ధం చేసిన నకులసహదేవులు, భీమార్జునులు ఓడిపోతారు. తమ్ములందరూ ఓడిపోయిన విషయం తెల్సుకున్న ధర్మరాజు స్వయంగా యుద్ధానికై బయలుదేరగా శ్రీకృష్ణుడు అతన్ని వారించి మయూరధ్వజుడ్ని యుద్ధంలో జయించడం సాధ్యంకాదనీ, మహాబల పరాక్రమవంతులైన భీమార్జునులే ఓడిపోయారనీ,అతడ్ని కపటోపాయాంతో మాత్రమే జయిం చాలనీ చెప్తాడు. శ్రీకృష్ణుడు, ధర్మరా జుతో కలసి వృద్ధ బ్రాహ్మణుల రూపంలో మణిపురం చేర్తాడు. ఆ బ్రాహ్మణులను చూసిన మయూరధ్వ జుడు వారికి దానం ఇవ్వదలచి ఏమి కావాలో కోరుకొమ్మని అడుగుతాడు. దానికి శ్రీకృష్ణుడు..రాజా! మీ దర్శనార్థమై మేమువస్తున్న దారిలో ఒక సింహం అడ్డు వచ్చి ఇతని కుమా రుడ్ని పట్టుకుంది. బాలుని విడిచి పెట్ట వ లసిన దిగా మేముప్రా ర్థించగా, సింహం మానవ భాషలో మీ కుమారుడు మీకు కావాలంటే మణిపుర రాజైనా మయూరధ్వ జుని " శరీరంలోని సగభాగం నాకు ఆహారంగా, అతడి భార్యా పుత్రులే స్వయంగా కోసి ఇవ్వగా తెచ్చి ఇస్తే, ఇతడ్ని వదిలేస్తాననీ చెప్పిందనీ, కనుక ప్రభువులు మా యందు దయదలచి తమ శరీరంలోని సగభాగాన్ని దానమిచ్చి ఇతడి కుమారుని కాపాడమని కోరుతారు. వారి కోరిక విన్న మయూరధ్వజుడు అంగీకరించి దానికి తగిన ఏర్పాట్లు చేయించి భార్యాసుతులు అతని శరీరాన్నిమధ్యకు కోసి వారికి ఇవ్వమని చెప్తాడు. వారు ఆయన శరీరాన్ని సగంగా కోయటం చూచిన ధర్మరాజు అతని దాన గుణానికి నివ్వెరపోయాడు. ఇంతలో మయూరధ్వజుని ఎడమకన్ను నుంచి నీరు కారటం చూసిన ధర్మరాజు తమరు కన్నీరు కారుస్తూ ఇచ్చిన దానం మాకు వద్దు గాక వద్దు అంటాడు. అందుకు మయూరధ్వజుడు, మహాత్మా తమరు పొరపడుతున్నారు. బాధపడి నా శరీరాన్ని మీకివ్వటం లేదు. నా కుడి భాగం పరోపకారానికి ఉపయోగపడింది, కానీ ఆ భాగ్యం తనకు కలగటంలేదు కదా అని ఎడమ కన్ను చాలా బాధపడుతూ కన్నీరు కారుస్తున్నది. అని వివరిస్తాడు. మయూరధ్వజుని దానశీలతకు మెచ్చిన శ్రీకృష్ణుడు తన నిజరూపాన్ని చూపి మయూరధ్వజా! నీ దానగుణం అమోఘం ! ఏదైనావరం కోరుకో! అనుగ్రహిస్తాను అంటాడు. పరమాత్మా! నా శరీరం నశించినా నా ఆత్మ పరోపకారార్థం ఉపయోగపడేలా నిత్యం మీ ముందు ఉండేలాగానుగ్రహించండి అని కోరుతాడు మయూరధ్వజుడు. అందుకు శ్రీకృష్ణుడు తథాస్తు అని పలికి, మయూరధ్వజా! నేటి నుంచీ ప్రతి దేవాలయం ముందు నీ గుర్తుగా నీ పేరున ధ్వజస్తంభాలు వెలుస్తాయి. వాటిని ఆశ్రయించిన నీ ఆత్మ, నిత్యం దైవ సాన్నిధ్యంలో ఉంటుంది. ముందు నిన్ను దర్శించి ప్రదక్షిణ నమస్కారాలు ఆచరించిన మీదటనే ప్రజలు తమ ఇష్టదైవాలను దర్శించుకుంటారు. ప్రతినిత్యం నీ శరీరమున దీపం ఎవరుంచుతారో వారి జన్మ సఫలం అవుతుంది. నీ నెత్తిన ఉంచిన దీపం రాతలందు బాటసారులకు దారి చూపే దీపం అవుతుంది అంటూ అనుగ్రహించాడు. ఆనాటి నుంచీ ఆలయాల ముందు ధ్వజస్తంభాలు తప్పనిసరిగా ప్రతిష్టించడం ఆచారమయింది. భక్తులు ముందుగా ధ్వజస్తంభానికి మొక్కి ఆ తర్వాతే మూలవిరాట్టు దర్శనం చేసుకోడం సాంప్రదాయంగా మారింది.



చట్టాలు ఎంత మంచివైనా వాటిని మన్నించేవారు అరుదు. అంతేకాక వాటిని అమలు చేయడం మరీ కష్టం. -ఫ్రాంక్లిన్

0883 - 246 2565
903 246 2565

MOHAN PUBLICATIONS

# మోహన్ పబ్లికేషన్స్

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.
WWW.MOHANPUBLICATIONS.COM

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

63. కలశపూజలు (9ఒకేసారి) 150-00
64. కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) ....
65. హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) ....
66. గోమాత 40-00

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

1. శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు 45-00
పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం
2. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, 50-00
3. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, 50-00
4. స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) 99-00
5. లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి 63-00
6. స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ 108-00
7. సర్వదేవతా స్తోత్రమంజరి 120-00
8. సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) 24-00
9. విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) 25-00
10. లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) 36-00
11. లలితా సహస్రనామములు 24-00
12. లక్ష్మీ సహస్రనామములు 24-00
13. దుర్గా సహస్రనామములు 24-00
14. ఆంజనేయ సహస్రనామములు 24-00
15. శివ సహస్రనామములు 24-00
16. విష్ణు సహస్రనామములు 24-00
17. గణపతి సహస్రనామములు 24-00
18. సుబ్రహ్మణ్య సహస్రనామములు 24-00
19. గాయత్రి సహస్రనామములు 24-00
20. లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు 24-00
21. శ్రీరామా సహస్రనామములు 24-00
22. సరస్వతి సహస్రనామములు 24-00
23. సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం 24-00
24. శ్రీవేంకటేశ్వరసహస్రనామములు 24-00
25. మణిద్వీపవర్ణన (పెద్దది) 24-00
26. సంధ్యావందనం 24-00
27. మంత్రపుష్పమ్ ....
28. త్రిభాషా హనుమాన్‌చాలీసా 15-00
29. హనుమాన్ చాలీసా 10-00

